MANNEMKONDA HANUMADDASU
KEERTHANALU OKA PARISHEELANA

R. Rambabu.

ప్రథమ ముద్రణ:– ఆగష్టు 1991
శ్రీ ప్రజోత్పత్తి, శ్రావణం

ప్రతులు:– 1000

హక్కులు:– రచయితవి

వెల:– రూ॥ 30.

ప్రతులకు:– ఆర్. పద్మ
ఇంటి నెం. 6–1–2/బి-53
జిల్లాపరిషత్ వెనుక, నల్లగొండ.

తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సహాయంతో ముద్రితం.

ముద్రణ:– ఉదయ ప్రింటర్స్-నల్లగొండ.

అనుక్షణం
నా అభివృద్ధిని
కాంక్షించే

అమ్మ కు



విద్యను
మించిన విత్తం
లేదని చెప్పే

నాన్న కు

అంకితం

డా॥ బేతవోలు రామబ్రహ్మం అధ్యక్షులు
భక్తిప్రద కవితాశాఖ, తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరు.

# అనుపల్లవి

'తల్లీ వనుబోధింపవే! నతజన కల్ప వల్లి! నను బ్రోవవే' అనే పాట చాలా ప్రసిద్ధం. 'పాలించుమని తెల్పవే! నీ విభుని నా పాలికి రమ్మనవే' అనే పాటకూడా చాలా ప్రసిద్ధం. వీటిని హాయిగా భక్తి తన్మయత్వంతో పాడుకునే పాత తరంవాళ్ళకి వీటి రచయితని గురించి అంతగా తెలియదు. అస్సలు ఏమీ తెలియదన్నా అతిశయోక్తి కాదు. ఈ బంగారం లాంటి పాటలని రచించిన మహానుభావుడు మన్నెంకొండ హనుమద్దాసు.

ఈ భక్తకవిని గురించి లోకానికి తెలియ జెప్పడంకోసం మిత్రుడు రామడుగు రాంబాబు పరిశోధన చేశాడు. ఇందుకని ఇతడినీ, ఇతని పరిశోధనకు మార్గదర్శకత్వం వహించిన డా॥ పాన్నా లీలావతమ్మగారిని మనసారా అభినందిస్తున్నాను.

ఈ చిన్న పరిశోధన గ్రంథంలో భక్తిని గురించి అనేక విషయాలు ఉన్నాయి. హనుమద్దాసు కీర్తనల్లో నవవిధ భక్తులూ ఎలా చోటు చేసుకున్నాయో వివరించిన తీరు బాగుంది. రామదాసుకీ హనుమద్దాసుకీ పోలికలు చాలా ఉన్నాయి. వాటిని అవలోడించి సోదాహరణంగా చూపిన తీరు ప్రశంసనీయంగా ఉంది. ఈ సిద్ధాంత నిబంధనకు ఈ ప్రకరణం ప్రాణిస్నాయువు.

ఒకరు రామదాసు, ఒకరు హనుమద్దాసు దాసభక్తిని బట్టి హనుమద్దాసు గరీయసుడు, కవితాశక్తిని బట్టి ఏవ్యక్తి పటీయకుడో సహృదయులే తేల్చుకోవాలి. అందుకు ఈ గ్రంథం ఒక సాధనమవుతుంది.

చిరంజీవి రామడుగు రాంబాబు త్వరలో పి. హెచ్. డి. పట్టాన్ని కూడా పొందాలని ఆకాంక్షిస్తున్నాను.

5-11-1990 బేతవోలు రామబ్రహ్మం

**డా॥ పొన్నా లీలావతమ్మ**

ఉపన్యసకురాలు

భక్తిపద కవితాశాఖ తెలుగు విశ్వవిద్యాలయం

రాజమండ్రి ప్రాంగణం బొమ్మూరు–533124

తూర్పు గోదావరి జిల్లా.

# ఆశీర్వాణి

వాగ్గేయకారులు అనగానే మనకు అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య, సారంగపాణి పేరేగుర్తుకు వస్తారు. ప్రజలలో భక్తిప్రపత్తులను, సద్గుణాలను పెంపొందించి వారిని ఇహపర సాధకులుగా తీర్చిదిద్దటమే ఈ పుణ్యపురుషుల అవతరణ ధ్యేయం. అందుకు వీరు కీర్తన రచననే సులభసాధనంగా గ్రహించి వేలాదిగ కీర్తనలు రచించిచారు. ఈ పరమ భక్తుల పద సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాలలో విరివిగా పరిశోధనలు జరగటం వల్ల వీరు, వీరి సాహిత్యం సాహిత్యలోకానికి ప్రజలకు సుపరిచితమయింది. కానీ సాహిత్య లోకానికి ప్రజలకు తెలియబడకుండా ఇంకా ఎందరో వాగ్గేయకారులు మట్టిలో మాణిక్యాలై దాగివున్నారు. అలాంటివారిని గూర్చి, వారి సాహిత్యాన్ని గూర్చి శోధించి లోకానికి తెలియ జేయాలంటే పద సాహిత్యంపై ప్రత్యేక అభిరుచి, భగవద్భక్తి, సంగీతప్రీతి, వినయసంపత్తి, భూతదయ మొదలైన ఉత్తమ లక్షణాలు కలిగిన పరిశోధకులు ముందుకు రావాలి. ఈ సల్లక్షణాలను పుణికి పుచ్చుకున్న ఉత్తమ పరిశోధకులలో రాంబాబు ఒకడు.

రాంబాబు తొలిసారిగా నన్నుకలుసుకొని మేడమ్! మీ పర్యవేక్షణలో ఎం. ఫిల్. పరిశోధన చేయాలనివుంది అన్నప్పుడు నేను పరిశోధనాంశం ఏదైనా నిర్ణయించుకున్నావా? అని అడిగాను అప్పుడు అతను 'నాకు భక్తి సాహిత్యం అంటే ఇష్టం అందులోనూ పదసాహిత్యం అంటే అభిమానం అందులోనూ మరీ అజ్ఞాతంగా వున్న వాగ్గేయకారుని గూర్చి పరిశోధన చేయాలని జిజ్ఞాసగావుంది', అన్నాడు, అజ్ఞాత వాగ్గేయకారులెవరనైనా గుర్తించావా అని నేను అడుగగా రాంబాబు, "ఉన్నాడొక మహానుభావుడు మన్నెంకొండ హనుమద్దాసు" అనిచెప్పి, ఆభక్తుడు వ్రాసిన కీర్తనలు

నాకు చూపించారు. అందులో ఈ వాగ్గేయకారుడు శ్రీరామచంద్రునిపై నవవిధ భక్తిమార్గాలతో కూడిన కీర్తనలు, మధురభక్తి, వాత్సల్యభక్తి, తోకూడుకున్న కీర్తనలు, సులభశైలిలో వ్రాసినట్లు ద్యోతకమయ్యాయి. ఈ కీర్తనలు పండితులు పామరులు అనే భేదం లేకుండా అందరూ చదువుకోవడానికి, హాయిగా పాడుకోవడానికి, విని ఆనందించడానికి భగవంతునితో తాదాత్మ్యం చెందడానికి అనువుగా ఉన్నాయి. అంతే కాకుండా హనుమద్దాసు, రామదాసు ఇద్దరూ తెలంగాణా ప్రాంతీయులే కాబట్టి రామదాసు కీర్తనల ప్రభావం కూడా హనుమద్దాసు కీర్తనలపై ఉన్నట్లుగా తోచడం వల్ల ఈ అజ్ఞాత వాగ్గేయకారునిపై పరిశోధన చేయిస్తే బాగుంటుందని నాకు అనిపించింది.

రాంబాబుకు ఈ అంశాన్ని పరిశోధనాంశంగా నిర్ణయించడానికి అప్పటి (1987-88) తెలుగు విశ్వవిద్యాలయం భక్తిపద కవితాశాఖ సాహిత్యపీఠాధిపతి సుప్రసిద్ధ పండిత పరిశోధక విమర్శక నిష్ణాతులు సౌమ్యమూర్తులు, భక్తిదయా హృదయులు అయిన ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారిని కలుసుకొని తమ అభిప్రాయాన్ని అడిగాను. వారు నిండుమనస్సుతో ప్రోత్సహించి అనుమతించారు. పిన్నలపట్ల ఎప్పుడూ వాత్సల్యామృత దృక్కులను వెదజల్లే ఈ ఆచార్యులవారి చల్లని నీడలో నా పర్యవేక్షకత్వం వెలుగులో రాంబాబు చిత్తశుద్ధితో నిర్విరామంగా ఒక సంవత్సరం పరిశోధన కృషిచేయగా వెలువడిన భక్తిరసఫలం మన్నెంకొండ హనుమద్దాసు కీర్తనలు-ఒకపరిశీలన అనే ఈ ఎం.ఫిల్. సిద్ధాంత గ్రంథం. ఈ గ్రంథం సాహిత్య జిజ్ఞాసులకు, పదసాహిత్య అభిమానులకు భక్తిరస హృదయులకు, సంగీతప్రియులకు అందరికీ ఆనందజ్ఞానోపదేశాలను అవలీలగా అందిస్తుందని నా విశ్వాసం.

ఈ సిద్ధాంత గ్రంథానికి నా అభిప్రాయాన్ని వ్రాసి పంపించవలసిందిగా రాంబాబు నాకు లేఖ వ్రాయగా ఈ గ్రంథానికి పర్యవేక్షకురాలిని నేనేకాబట్టి నేను వ్రాస్తే బాగుండదేమోనని భావించాను. పెద్దలైన అప్పటి సాహిత్య పీఠాధిపతి ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారి చేతను ఇప్పటి పీఠాధిపతి లోకవిదితమైనకవి పండిత విమర్శక పరిశోధకుడు, గీతరచయిత, అవధాని, వాగ్మి, ఆర్ద్రహృదయులు అయిన ఆచార్య

జేతవోలు రామబ్రహ్మంగారి చేతను అభిప్రాయాలు వ్రాయిస్తే బాగుంటుందని తెలియజేశాను. అయినా పట్టుదల కార్యదీక్ష కలిగిన ఈ పరిశోధక విద్యార్థి రాంబాబుకు నాపై గురుభక్తి, సోదర ప్రేమ అపారంగా ఉండటంచేత నా ఆశీస్సును విధిగాకోరాడు. నాపర్యవేక్షకత్వంలో తొలిసారిగా వెలువడిన రాంబాబు ఎం. ఫిల్. సిద్ధాంత వ్యాసం గ్రంథ రూపం దాల్చినందుకు నాకెంతో ముదావహంగా వుంది.

ప్రస్తుతం ఈ పరిశోధక సోదరుడు 'విశ్వనాథ కృష్ణభక్తి' అనే అంశంపై తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠంలో నా పర్యవేక్షణ లోనే పాక్షికంగా పి. హెచ్. డి. పరిశోధన చేస్తున్నాడు. రాంబాబు ఈ పరిశోధనను కూడా భక్తి శ్రద్ధతో, ఆత్మీయతతో అవిరళ కృషి జరిపి సత్వరగా పూర్తిచేయాలని, అదికూడా గ్రంథరూపం దాల్చాలని, సాహిత్య రంగంలో ఉత్తరోత్తరాభి వృద్ధిని సాధించి సత్ప్రయోజకుడు కావాలని రాంబాబును మనసారా ఆశీర్వదిస్తున్నాను

సజ్జన విధేయురాలు

28-10-1990 హొన్నా లీలావతమ్మ

డా॥ వి. విశమయ్య
లెక్చరర్ (తెలుగు)
గీతా విజ్ఞాన ఆంధ్ర కళాశాల,
రామగిరి—నల్లగొండ.

# భక్తితత్త్వ నివేదనం

'భక్తి' పదనిర్వచనంలో సేవించటం, భజించటం, అర్చించుకోవడం, ప్రేమించటం అన్న లక్షణాలు ప్రాణభూతములై యున్నట్లు తెలుస్తుంది. వీటన్నింటిలో, ప్రేమించటం గొప్ప లక్షణం. ఎవరిని ప్రేమించాలి దేన్ని ప్రేమించాలి అన్న ప్రశ్నలకు 'విష్ణువును' అని భాగవతం సమాధానం చెప్పింది. విష్ణువన్నమాటకు ఈ సమస్తమైన చరాచర సృష్టియందు సర్వత్రా వ్యాపించి యున్నవాడని అర్థం చెప్పబడింది. విష్ణువును భజించటం, సేవించటం, ప్రేమించటమంటే ఈ సృష్టినీ లోకాన్నీ ప్రేమించటమన్నమాట. 'రామ' శబ్దానికి రమింప జేయడమన్న అర్థం చెప్పబడింది. 'రామోవిగ్రహవాన్ ధర్మః' అనడంవల్ల ధర్మంతో లోకం రమించడం అన్న అర్థం వస్తుంది. ఇందువల్ల విష్ణువును భజించటం, సేవించటం, ప్రేమించటం, అంటే లోకాన్ని విష్ణురూపంలో భజించటం, సేవించటం, ప్రేమించటమనీ; రాముణ్ణి భజించట, సేవించటం, ప్రేమించటమంటే లోకంలోని ధర్మాన్ని రామ రూపంలో భజించటం, సేవించటం ప్రేమించటమనీ తేటపడింది. సగుణ సమారాధనం నిర్గుణానికి బాటవేస్తుందని చెప్పటమే సారాంశం. ఈ దేశపు దేవాలయ సంస్కృతికిదే బీజం.

భక్తివల్ల సమాజంలో తరతమభేదాలు క్రమంగా నశించిపోయి అంతా భగవన్మయంగా, విష్ణుమయంగా, రామమయంగా, తోచి ప్రేమ కలుగుతుంది, ఈ ప్రేమభావమే ముక్తికి సోపానం. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసి, స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే" అని భక్తి తత్త్వాన్ని గూర్చి 'వివేకచూడామణి' నిర్వచించింది.

ఇట్టి భక్తి తత్వాన్ని లోకంలో ప్రచారం చేయడం కోసం. వాగ్గేయకారులు పుట్టారు. ఆశువుగా పాటకట్టి పాడుకుంటూ తిరగడం వాగ్గేయకారుల లక్షణం. భగవంతుడైన రాముణ్ణి కీర్తిస్తూ తిరిగినవాళ్ళల్లో త్యాగరాజు, రామదాసు ప్రత్యేకించి పేర్కొనదగ్గవాళ్ళు. అందునా రామదాసు భజన సంప్రదాయాన్ని సృష్టించి పండిత పామరజనాన్ని పరవశింప జేసినట్టివాడు.

రామదాసు అడుగుజాడల్లోనే అడుగువేస్తూ రామనామ సంకీర్తనంతో లోకాన్ని రామమయం చేసినట్టివాడు మన్నెంకొండ హనుమద్దాసు.

చి॥ రామడుగు రాంబాబు తన ఎం. ఫిల్ పట్టంకోసం ఈ మన్నెం కొండ హనుమద్దాసు కీర్తనలను పరిశీలనకెన్నుకున్నాడు. ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి హనుమద్దాసుగారి జీవితంలోని, విశేషాలను తెలుసుకొని లోకానికి తెలిసేట్టు చేశాడు. ఆయన కీర్తనల్లో దాగియున్న రామదాసు హృదయాన్ని బహిర్గతంచేశాడు కాలగర్భంలో కలిసిపోనున్న వాగ్గేయ కారుణ్ణి సమకాలీన సమాజం గుర్తించి ఆయన్ని గూర్చి ఆలోచించేట్టు చేయగలిగాడు. అందుకు నేనీ చిరంజీవిని మనస్ఫూర్తిగా అభినంది స్తున్నాను. ఇతనికి మరింత ఉజ్జ్వలమైన భవిష్యత్తునను గ్రహించాలని నా రాముణ్ణి ప్రార్థిస్తున్నాను.

ఇట్లు

డా॥ వారణాసి బిక్షమయ్య

డా॥ వారణాసి వీరనారాయణశర్మ
64, శ్రీవేంకటేశ్వరకాలనీ, నల్లగొండ.

# ఆ కాం క్ష

'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసి' అన్న శంకర భగవత్పాదుల వాక్యం నిత్య సత్యం. భగవద్భక్తుల సాధన మార్గాలు పలురకాలు. వాటిలో భగవన్నామ సంకీర్తనం సర్వజనామోదం పొందిన మార్గం. సంకీర్తనమే ప్రధానంగా జీవించిన మహాత్ముల్లో మన్నెంకొండ హనుమద్దాసు ప్రసిద్ధుడు. ఈ కీర్తనల వైశిష్ట్యాన్ని గూర్చి పరిశోధించి లోకానికి చాటిన వర్ధిష్ణువు చిరంజీవి రామడుగు రాంబాబు కృషి ప్రశంసనీయమైనది.

ప్రసిద్ధాంధ్ర వాగ్గేయకారుల సరసన నిల్చిన హనుమద్దాసు, మన్నెంకొండ లక్ష్మీవేంకటేశ్వరస్వామికి గోపుర ప్రాకారాలు నిర్మించడమే గాక, భద్రాద్రి రాముని మీద మనోహరమైన కీర్తనలను రచించడం చెప్పుకోదగ్గ అంశం. ఆ భాగవతోత్తముని జీవిత విశేషాల్ని పొందుపరచిన విధం మెచ్చదగినది.

హనుమద్దాసు కీర్తనల్లో ప్రతిఫలించిన భక్తివైవిధ్యాన్ని పరిశీలించిన తీరు, రామదాసు కీర్తనలకూ హనుమద్దాసు కీర్తనలకూ గల సారూప్యాన్నీ, భావైక్యాన్నీ పరిశోధించి చూపి చెప్పిన వైనం, చిరంజీవి రాంబాబు పరిశీలనా నైపుణ్యాన్ని చాటుతూంది.

సంగ్రహంగా, స్పష్టంగా, నిర్దుష్టంగా చెప్పడం ఈ చిరంజీవి విశిష్ట లక్షణం. భవిష్యత్తులో ఇతని పరిశోధన మరిన్ని కొత్త అంశాల్ని తెలుగు లోకానికి చాటగలదని నా ప్రగాఢ విశ్వాసం. ఇతనికాశక్తి సామర్ధ్యాల్ని భగవంతుడు ప్రసాదించాలని ఆకాంక్షిస్తున్నాను.

డా॥ వారణాసి వీరనారాయణశర్మ
అధ్యక్షులు
పరిశోధక మండలి, నల్లగొండ.

నల్లగొండ,
25-10-90

# కృతజ్ఞతలు

'మన్నెంకొండ హనుమద్దాసు కీర్తనలు—ఒక పరిశీలన అనే అంశంపై పరిశోధన చేయడానికి అవకాశమిచ్చి ఆశీర్వదించిన గురువర్యులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు, పరిశోధన వ్యాసాన్ని సమర్పించే సమయంలో తగిన సూచనలిచ్చిన గురువర్యులు, తెలుగు విశ్వవిద్యాలయం భక్తి పదకవితా శాఖాధ్యక్షులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు.

నా పరిశోధనకు పర్యవేక్షణ బాధ్యత వహించి, సముచిత సలహాలతో నా పరిశోధనకు తోడ్పడిన డా॥ పొన్నా లీలావతమ్మగారు, తమ విలువైన సలహాలతో నన్నుప్రోత్సహించిన గురువర్యులు డా॥ జయధీర్ తిరుమలరావుగారు.

నాలో పరిశోధనపు ఆలోచనలను కలుగజేసి, నాకు పరిశోధనాంశాన్ని సూచించినది మొదలు చివరివరకు గురుతరబాధ్యతను వహించి, అనుక్షణం నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించిన గురుతుల్యులు మా బావగారు రామ భక్తులు అయిన డా॥ వారణాసి బిక్షమయ్యగారు.

నా ఈ పరిశోధన సమయంలో తగిన పుస్తకముల నిచ్చి సహకరించిన తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి, గ్రంథాలయాధికారులు శ్రీమతి తారాబాయిగారు, సహాయకులు శ్రీరాజుగారు, సాహితీమిత్రులు డా॥ సాగి ఆంజనేయశాస్త్రిగారు, పరిశోధన సమయంలో నా వెన్నంటి ఉన్న ప్రాణమిత్రుడు శ్రీయుత. పి. రామలింగయ్యశర్మగారు, పరిశోధన సమయంలో తన వంతు సహాయం చేసిన మన్నెంకొండ దేవస్థాన అధికారులు శ్రీనర్సింహులుగారు, ఆలయ పూజారులు, సిబ్బంది; నా వ్రాతప్రతులకు అచ్చు పుస్తకములవలె అందమైన ముఖ చిత్రాలను వ్రాసి ఇచ్చిన మిత్రులు శ్రీచందు, శ్రీ K.L.N మూర్తి, శ్రీరామారావుగారలు ఇంకా నా పరిశోధనకు సహకరించిన ఎందరో మహానుభావులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

నా ఈ పరిశోధన వ్యాసాన్ని ఆమోదించిన గురువర్యులు కీ॥ శే॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి నమస్సుమాంజలి ఘటిస్తున్నాను.

నా మీద అనురాగంతో నేను అడగ్గానే నా పుస్తకానికి తమ అమూల్యమైన అభిప్రాయాలను వ్రాసి ఇచ్చిన పెద్దలకు హృదయ పూర్వకంగా నమస్కరిస్తున్నాను.

నాకు తోడూ నీడా అయి నా మనసెరిగి మెలిగే ఇల్లాలు నా అర్ధాంగి శ్రీమతి పద్మకు అభినందనలు.

అన్నిటిని మించి ఈ పుస్తకాన్ని అందంగా అచ్చువేసిన మిత్రులు శ్రీ బత్తుల వీరప్ప, యిడికూడ యాదగిరి (ఉదయ ప్రింటర్స్) గారలకు ఆజన్మాంతం ఋణపడి ఉంటాను.



— రాంబాబు

# విషయసూచిక

# వాగ్గేయకార నిర్వచనం

మాటల కూర్పు వాక్కు, సంగీతపు కూర్పు గేయం, వాక్కు మాతువు గాను, గేయం ధాతువు గాను, పేర్కొనబడింది. ఈ వాక్కును గేయాన్ని సమకూర్చ గలిగిన వాడు వాగ్గేయకారుడు. ఈ విషయాన్ని శార్ఙ్గదేవుడు

"వాఙ్మాతు రుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే
వాచం గేయం చ కురుతే యః స వాగ్గేయకారకః"
(ఆంధ్రవాగ్గేయకార చరిత్ర. పేజి–48)

అని తెలియజేశాడు.

వాక్కు సాహిత్యానికి సంబంధించింది. గేయం సంగీతానికి సంబంధించింది. సాహిత్యానికి ప్రాతిపదిక పదం, భావాన్ని తెలియచేయడం దీనిలక్షణం. సంగీతానికి ప్రాతిపదిక స్వరం, నాదం దీని లక్షణం. కనుక భావ ప్రధానమైన పదాన్ని, నాద ప్రధానమైన స్వరాన్ని గీతంగా గూర్చేవాడే వాగ్గేయకారుడు. 1

---

1 అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు; పేజి–13

దాదాపు 16వ శతాబ్దం నుంచి వాగ్గేయకారుడు అనే శబ్దానికి 'బయకారుడు' అనేపదం వ్యవహారంలో ఉంది. ఈవిషయం సంగీత సుధలో

మాతూంశ్చధాతూ నుభయాన్ కరోతి
యస్తం విదుర్బాయకార సంజ్ఞం
తమేవలోకా బయకార నామ్నా
వదంత్యపభ్రంశ పదేసర్వే ''

(ఆంధ్రవాగ్గేయకార చరిత్ర పేజి-54)

అని చెప్పబడింది.

ఆచార్య బి. యన్. రెడ్డిగారు వాగ్గేయకారుని గురించి వివరించి చెప్తూ మన సినిమాల్లోలాగ పాట వ్రాసినవాడొకడు, దానికి సంగీతం కూర్చిన వాడొకడు, పాడి రంజింపచేసే వాడు మరొకడులాగా కాకుండా వాక్కారుడు, గేయకారుడు, గాయకుడు, అయినవాడే వాగ్గేయకారుడు అని తెలియజేశారు [1]

# వాగ్గేయకారుల లక్షణాలు

నిజానికి ''వాగ్గేయకారుడు'' అన్నమాటలోనే అతని కుండవలసిన లక్షణాలు వ్యక్తమవుతున్నాయి ఇవేకాక వాగ్గేయకారునికి అవసరమైన ముఖ్య లక్షణాలను శార్ఙ్గదేవుడు తనసంగీత రత్నాకరంలోని ప్రకీర్ణకాధ్యాయంలో వివరించి ఉన్నాడు.

శబ్దానుశాసన జ్ఞానం కలిగి ఉండాలి అంటే సరియైన వ్యాకరణ జ్ఞానం మాత్రమేకాదు సుశబ్దాపశబ్ద వివేచనం కలిగి ఉండాలి అమర కోశాది నిఘంటువులలో లోకప్రమాణ రీత్యా ఏ అర్థాలు సాధువులని

1 అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయఫణితులు పేజి-4.

నిర్వచించారో అదంతాకూడ చక్కగా తెలిసి ఉండాలి. రసభావపరిజ్ఞానం కలిగిఉండాలి. వేర్వేరు భాషలన్నింటిలో విశేషపరిజ్ఞానం కలిగి ఉండాలి. సంస్కృతంలోని ఛందోవిభాగాలు మాత్రమేకాకుండా, దేశిభాషల్లోని ఛందోభేదాలు కూడా తప్పకుండా తెలిసి ఉండాలి. అలా ఉన్నట్లయితే దేశభాషల్లో వాగ్గేయకారుడు కాగలుగుతాడు. తన రచనల్లో గ్రామ్యోక్తి అపశబ్దదోషాలు లేకుండా చూసుకోవలసిన బాధ్యత కూడా వాగ్గేయకారుడిదే గాత్రం హీనస్వరం కావటం, ఆరంభించిన రీతిలో రచన కొనసాగించలేక మధ్యలో భంగం చేయటం, మొదలైన దోషాలను వాగ్గేయకారుడు తననుంచి దూరం చేసుకోవాలి. వాగ్గేయకారుడు శ్రావ్య గాయకుడై ఉండాలి. క్రోధం వాక్కునకు కఠినత్వాన్ని చేకూర్చేగుణం ద్వేషం అంతరంగాన్ని సంక్షుభితం చేస్తుంది. కాబట్టి వాగ్గేయకారుడు ఈ రెండింటిని విడిచిపెట్టినవాడై ఉండాలి. ఇవే కాకుండా వాగ్గేయకారుడు నృత్యగీతవాద్యాలు మూడింటిలోను నేర్పు సంపాదించి ఉండాలి 1

# వాగ్గేయకారుల భేదాలు

వాగ్గేయకారుల లక్షణాలను చెప్పిన శార్ఙ్గదేవుడు వాగ్గేయకారులను ఉత్తమ మధ్యమాధములుగా వర్గీకరించాడు. ధాతుమాతువులు రెండింటిలోను సమర్థుడైతే అతడు ఉత్తమ వాగ్గేయకారుడు సంగీత రచన బాగాచేయగలిగి మాటల కూర్పులో మందుడైతే అతడు మధ్య తరగతి వాగ్గేయకారుడనిపించుకుంటాడు. ధాతుమాతువుల రెండింటి రచన తెలిసినా ప్రబంధాల్లో ప్రౌఢి లేనివాడుకూడ మధ్యమతరగతికి చెందినవాడే అవుతాడు మాటల కూర్పులో నేర్పరి, సంగీత రచనలో సామర్థ్యం లేనివాడైతే అతడు అధముడు 2

---

1, 2 ఆంధ్రవాగ్గేయకార చరిత్ర పేజి-50, 51; 53, 50

శార్ఙ్గదేవుని వాగ్గేయకారుల విభజనం నేటి పరిస్థితుల దృష్ట్యా ఆలోచిస్తే, అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలతో కూడుకొనిఉంది. ప్రసిద్ధులైన వాగ్గేయకారులు కూడా మధ్యమాధమ శ్రేణిలోకి చేరిపోయే ప్రమాదం ఈ విభజన వల్ల కలుగుతుంది. తాళ్ళపాకవారిలో శబ్దానికున్న ప్రాధాన్యం సంగీతానికి లేదు. మరి అప్పుడు పదకవితాత్రయమైన తాళ్ళపాక కవులు అధమశ్రేణి వర్గానికి చెందినవారు కావలసివస్తుంది. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరం 12వ శతాబ్దానికి చెందింది. తెలుగులో పదకవిత్వం దీని తరువాతనే ప్రారంభం అయింది. అందువల్ల ఈ విభజన మన పదకవుల వర్గీకరణకు తగినట్లుగాలేదు కాబట్టి శార్ఙ్గదేవుడి వర్గీకరణకు మారుగా వాగ్గేయకారులను ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, అధమ, భేదాలతో విభజించడం యోగ్యంగా ఉంటుంది.

సంగీత సాహిత్యాలను సమదృష్టితో పోషించి రచన చేసేవాడు ఉత్తమోత్తముడు అంతేకాకుండా సాహిత్యపుపాలు ఎక్కువుండి సంగీత విభాగం తక్కువగా ఉన్నా, అలాగే సంగీతపుపాలు ఎక్కువుండి సాహిత్య దృక్పథం తక్కువగా ఉన్నా, ఒకదాన్ని ఇంకొకటి కప్పివేయకుండా చేసే రచనలన్నీ ఉత్తమోత్తమ శ్రేణిలో చేరుతవి. కేవలం సంగీత రచన బాగాచేయగలిగి, మాటలకూర్పులో ప్రాగల్భ్యం ప్రదర్శించ లేకపోతే ఉత్తముడు. సంగీతసాహిత్యాల రెండింటి రచన తెలిసినా ప్రబంధాల్లో ప్రౌఢిలేనివాడు కూడా ఈ కోవలోకే చేరిపోతాడు. కేవలం మాటల కూర్పులో నిపుణుడై సంగీతరచనలో ప్రౌఢిలేనివాడైతే మధ్యముడు. సంగీతసాహిత్యాలలో ఏ మాత్రం పరిచయం లేకుండా కేవలం అనుకరణ బుద్ధితో రచనచేసేవాడు అధముడని చెప్పవచ్చు.

## సంకీర్తన లక్షణం

తెలుగు సాహిత్యాన్నంతటిని మార్గసాహిత్యం, దేశిసాహిత్యం అని రెండు విధాలుగా విభజించవచ్చు. తెలుగులోని దేశిసాహిత్య ప్రవాహం

మూడను పాయలుగా ప్రవహిస్తూ వచ్చింది. మొదటిది కేవలం బాసపదకవిత మూడోది తాళ్ళపాక అన్నమాచార్యునితో ప్రారంభమైన సంకీర్తనా కవిత ఇదే తెలుగులోని పదకవిత.

" పదం అంటే మామూలు అర్థంలో పాట అనేవాడుక ఉంది అది రాగతాళాలతో ఉండవచ్చు లేదా కేవలం స్వరసహితం కావచ్చు ఏదేమైన పదం అనేది మాత్రం పద్యం కంటే భిన్నమైనది. ఇదే సంకీర్తన, కీర్తన, కృతి అనే విధంగా మార్పులు పొందింది. 1

భరతముని చాలాకాలం క్రితమే పదం అంటే ఏమిటో నిర్వచిస్తూ స్వరతాళ పదాత్మకమైంది గాంధర్వమనీ స్వరతాళమభావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది పదమని 2 తెలియచేశాడు ప్రాచీనకాలంలో పదం, సంకీర్తనం అనేవి పర్యాయ పదాలుగా వ్యవహరించ బడేవి. అవి శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ సంకీర్తనలు అని రెండు విధాలుగా మారాయి. క్షేత్రయ్య శృంగార పరంగా రచన చేయడంవల్ల అతని రచనలు పదాలనీ, త్యాగరాజు భక్తిజ్ఞానాత్మకంగా రచనచేయడంవల్ల ఇతని రచనలు కీర్తనలనీ వ్యవహరించడం జరిగింది. 3

'కృశాతుసంశబ్దనే' అనే ధాతువుపై భావార్థంలో 'ల్యుట్' ప్రత్యయం చేరగా 'కీర్తనం' అనే రూపమేర్పడుతుంది. 'సమ్యక్ కీర్తనం' సంకీర్తనం అని వ్యుత్పత్తి. గేయతే ఇతిగీతమ్ పాడబడేదే గీతం లేదా గేయం అవాఙ్మానస గోచరమైన ఒకానొక దివ్యశక్తిని కీర్తించి పాడేదే సంకీర్తనం 4

కీర్తనను గూర్చి శ్రీనివాసఅయ్యంగారు తన గానభాస్కరంలో 'అఖిల సృష్టిస్థితి లయకారణభూతుండైన సర్వేశ్వరుని నామసంకీర్తనం

---

1 తెలుగులో పదకవిత పేజి—6

2 భరతముని: నాట్యశాస్త్రము (అధ్యా—32: శ్లో. 25.47)

3 తెలుగులో పదకవిత పేజి—12

4 మనవాగ్గేయకారులు తొలిసంకీర్తన కవులు పేజి—5

చేయుటకై ఒక ధాతుశైలిని అనుసరించి వ్రాయబడిన సాహిత్యము కీర్తనమనబడును' అని వివరించారు (ఆ. వా. చరిత్ర) పేజి 76)

"తాళ్ళపాక చినతిరుమలాచార్యుని సంకీర్తన లక్షణంలో పదాలు మూడు విధాలని చెప్పబడింది.

1. **వృత్తపదాలు:** పాటల్లాగా కనిపించే మన పద్యాలు, పద్యాల్లాగా తోచే మనపాటలు, అంటే మంజరులు, ద్విపదలు, రగడలు ఉదాహరణ ప్రబంధాలు మొదలైనవి.

2. **నిబంధపదాలు:** యతిప్రాసలు కలిగి ఉండి మాత్రాగణ ప్రధానమైనవి. అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య హనుమద్దాసు మొదలైన వాగ్గేయకారుల కీర్తనలు ఇందుకు ఉదాహరణ

3. **అనిబంధపదాలు;** ఇవి రెండురకాలు (1) చూర్ణిక (2) తాళగంధి. తాళ బంధంగానీ, ఛందస్సుగానీ లేనట్టివి చూర్ణికలనబడతాయి. తాళని యతికలిగినవి తాళగంధులనబడతాయి. కృష్ణమాచార్యుల వచన సంకీర్తనలు ఈ పద్ధతికి చెందినవి. 1

మన సాహిత్యంలో వృత్తపదాలు, అనిబంధపదాలు ఒక వైపున ప్రచారాన్ని పొందుతూ ఉంటే, మరొక వంక సంగీత సాహిత్యజ్ఞానం కలిగిన వాగ్గేయకారులు నిబంధపదాలైన సంకీర్తనలను వ్యాప్తిచేశారు.

---

1 మన వాగ్గేయకారులు తొలిసంకీర్తన కవులు పేజి-9

'ఈ కీర్తనలు పల్లవి, అనుపల్లవి, చరణాలతో కూడి ఉండాలి, పల్లవిలోని అభిప్రాయం అనుపల్లవిలోను, చరణాల్లోను వివరింపబడుతూ; మళ్ళీ మళ్ళీ ఆవృత్తి అవుతూ ఉండే పల్లవితో భావం, వాక్యం పూర్తి అవుతుంది. 1

కీర్తన చివరి ఖండంలో వాగ్గేయకారుడు నిర్ణయించుకొన్న నామ ముద్ర ఉంటుంది. జయదేవుని అష్టపదుల్లోని ముద్ర భార్యా సహితంగా స్వనామాంకితమై ఉంటుంది. తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనలు వేంకటేశ్వర ముద్రాంకితాలు, త్యాగరాజు, రామదాసుల కీర్తనలు స్వనామాంకితాలు. క్షేత్రయ్య పదాలు మువ్వగోపాలస్వామికి అంకితాలు. హనుమద్దాసు కూడా త్యాగరాజు, రామదాసుల్లాగా స్వనామాంకితంగానే కీర్తనలు రచించాడు.

# పూర్వ వాగ్గేయకారుల సంక్షిప్త పరిచయం

వాగ్గేయకారులు భక్తిని ప్రచారం చేయడం కోసం కీర్తనలు వ్రాసి పాడారు. ఆపాడటంలో జనాన్ని రంజింపజేశారు. భగవంతుని ఆయా అవతారలీలలను ప్రజలకు తెలియజేసి వారిని స్వచ్ఛందమైన భక్తి మార్గంవైపు నడిపించడమే వాగ్గేయకారుల ప్రధాన లక్ష్యం. ఈ వాగ్గేయ కారులు మొదట సంస్కృతంలోను, తరువాత తెలుగు మొదలైన భాష ల్లోను కనిపిస్తున్నారు. సంస్కృతంలో జయదేవుడు, లీలాశుకుడు. తెలుగులో అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగరాజు, వీరిసరసన చేర్చదగినవాడే రామునిమీద కీర్తనలు రచించి తరించిన మన్నెంకొండ హనుమద్దాసు.

1 ఆంధ్రవాగ్గేయకార చరిత్ర పేజి–77

# సంస్కృత వాగ్గేయకారులు

**జయదేవుడు :** క్రీ శ 12వ శతాబ్దంలో గౌఢదేశపురాజైన లక్ష్మణసేనుని ఆస్థానానికి చెందినవాడు జయదేవుడు. ఇతడు తన అష్టపదుల్లో తన జన్మస్థానం 'బిందుబిల్వమని' చెప్పుకున్నాడు. 1 ఈ గ్రామం ఒరిస్సా రాష్ట్రానికి సంబంధించినది.

బాలాంత్రపు రజనీకాంతరావుగారు, ఆంధ్రవాగ్గేయకార చరిత్ర (పేజి–84)లో జయదేవుని కాలం గురించి చెబుతూ' జయదేవుడు క్రీ. శ. 1153వ సంవత్సరములో మరణించాడని దీన్నిబట్టి అంతకంటె 60,70 సంవత్సరముల ముందు ఆతడు జన్మించి ఉండవచ్చని, అంటే దాదాపు 1090 ప్రాంతం నుంచి అతను జీవించి ఉండవచ్చని' తెలియజేశారు.

భారతదేశం అంతటికి మొట్టమొదటి సంగీత సాహిత్య ప్రబంధంగా పేరువడసిన 'గీతగోవిందం' జయదేవుని రచనమే. 'గీతగోవిందం' లోని అష్టపదులు యావద్భారతంలోను బహుళ ప్రచారాన్ని పొందాయి.

**లీలాశుకుడు:** జయదేవుని తర్వాత భారతదేశమంతట ప్రఖ్యాతిపొందిన వాగ్గేయకారుల్లో, ప్రసిద్ధుడు లీలాశుకుడు చాగంటి శేషయ్యగారు ఆంధ్రకవి తరంగిణిలో లీలాశుకుడు 13వ శతాబ్దంలో జీవించినవాడని వ్రాశారు. 2 లీలాశుకుడు మహాకవి, పరమభక్తాగ్రేసరుడు, ఇతడు రచించిన 'కృష్ణకర్ణామృత' శ్లోకాలు యావద్భారతంలో బహుళ జనాదరణను పొందాయి.

---

1 జయదేవకృత 'గీతగోవింద కావ్యం' (అష్టపదులు) పేజి–(i)

2 ఆంధ్రవాగ్గేయకార చరిత్ర పేజి–92

జయదేవునికి దాదాపు ఒక శతాబ్దం తరువాతివాడైన లీలాశుకుడు ఆంధ్రుడని బాలాంత్రపు రజనీ కాంతరావుగారు [1] పేర్కొన్నారు. ఆంధ్ర దేశంలో బహుళ ప్రజాదరణను పొందిన 'చింతామణి' నాటక కథలోని బిల్వమంగళుడే లీలాశుకుడనే కథ అనూచానంగా వస్తోంది. చింతామణి అనే వేశ్యపట్ల మోహాన్ని పెంచుకొన్న బిల్వమంగళుడు రోగస్థుడైన తండ్రిని, పతివ్రత అయిన భార్యను నిర్లక్ష్యంచేసి, కామాంధుడై ఆవేశ్య దగ్గరికి చేరుకొనేసరికి, అప్పటికే జ్ఞానసంబోధం పొందిన చింతామణి సామాన్య వేషంతో వచ్చి బిల్వమంగళునికి తుచ్ఛమైన శరీరసుఖాల మీద యేవగింపు కలిగేలా చేస్తుంది. జ్ఞానోదయం పొందిన బిల్వమంగళుడు కళ్ళు పొడిచివేసుకొని కృష్ణభక్తుడైన లీలాశుకుడిగా మారి, కృష్ణసాక్షాత్కారం పొందిన తన్మయత్వంతో శ్రీకృష్ణ కర్ణామృతం రచించాడు.

క్రీ. శ. 13వ శతాబ్దంలో ఉండి సింహాగిరి నరహరిపైన వచన సంకీర్తనలు రచించిన కృష్ణమాచార్యుడు లీలాశుకుని కాలంలో జీవించిన వాడే.

# ఆంధ్ర వాగ్గేయకారులు

**తాళ్ళపాక అన్నమాచార్యులు:** తాళ్ళపాక అన్నమాచార్యుడు క్రీ. శ. 1408 క్రోధినామ సంవత్సరములో వైశాఖ శుద్ధ పౌర్ణమి నాడు విశాఖ నక్షత్రంలో లక్కమాంబ, నారాయణసూరి దంపతులకు జన్మించాడు. ఇతని జన్మస్థలం కడప జిల్లా రాజంపేట తాలూకాలోని తాళ్ళపాక గ్రామం. తెలుగులో పదసాహిత్యానికి మహోన్నతదశను సంక్రమింపజేసిన వాడు అన్నమాచార్యుడే. ఇతను శ్రీవేంకటేశ్వరుని మీద 32,000 సంకీర్తనలు రచించాడని ఆయన మనవడు తాళ్ళపాక చిన్నన్న

1 ఆంధ్రవాగ్గేయకార చరిత్ర పేజి-93

అన్నమాచార్య చరిత్రలో వ్రాశాడు. ఇవే కాకుండా ద్విపద సబంధంగా నవ్యరీతిలో రామాయణం, సంస్కృతంలో వేంకటాద్రి మహాత్మ్యం, తెలుగులో శృంగార మంజరి, 12 శతకాలు, సకల భాషల్లో అనేక ప్రబంధాలు, సంస్కృతంలో సంకీర్తన లక్షణం రచించాడు. వీటిలో 14వేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, శృంగార మంజరి, అలమేలు మంగమ్మపై వేంకటేశ్వర మకుటంతో రచించిన ఒకశతకం మాత్రమే నేడు మనకు లభిస్తున్నాయి.

పదకవితా పితామహుడు, ద్రావిడాగమ సార్వభౌముడు, సంకీర్తనా చార్యుడు అనే బిరుదాలతో ప్రసిద్ధికెక్కిన అన్నమయ్య క్రీ. శ 1503 సంవత్సరములో ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు వేంకటేశ్వరునిలో ఐక్యం చెందాడు.

**క్షేత్రయ్య :** క్షేత్రయ్య క్రీ. శ. 1600 నుండి 1660 సంవత్సరాల మధ్యకాలంలో జీవించాడు. ఇతని జన్మస్థానం కృష్ణా జిల్లాలోని 'మొవ్వగ్రామం' మొవ్వలోని గోపాలస్వామికి అంకితంగా శృంగార రస పూరితాలైన పదాలను క్షేత్రయ్య రచించాడు. వీటినే మువ్వగోపాల పదాలనికూడా అంటారు. 1

అన్నమయ్య శృంగార సంకీర్తనలే క్షేత్రయ్యకు మాతృకలని చెప్పవచ్చు. అన్నమాచార్యుల కాలంనాటి సంకీర్తనలు కాలక్రమేణా శృంగార రసపూరితాలై క్షేత్రయ్య కాలానికి పదాలుగా మారాయి. ఇతని పదాలు నృత్యాభినయానికి అనుకూలమైన విధంగా ఉంటాయి. క్షేత్రయ్య, మధుర, తంజావూరు గోలకొండ రాజాస్థానాల్లో నాలుగు వేలకు పైగా పదాలు చెప్పినట్లు తెలుస్తున్నది. 2

1 విజ్ఞానసర్వస్వం (4వ సం. పేజి-1072)
2 ఆంధ్రవాగ్గేయకార చరిత్ర పేజి--194

**భద్రాచల రామదాసు :** రామదాసు క్రీ. శ. 1620-1680 మధ్యకాలంలో గోలకొండ రాజ్యాన్ని అబుల్ హసన్ తానాషా, అబ్దుల్లా తానాషాలు పరిపాలిస్తున్నపుడు జీవించాడు. ఇతని అసలు పేరు కంచెర్ల గోపన్న మహాభక్తుడు భజనకీర్తనల రచయిత అయిన కబీరుదాసు రామదాసు యొక్క గురువని చెప్తారు. రామదాసు భద్రాచలం తహశీల్దారుగా ఉండే వాడు. రామునిమీద భక్తితో ప్రభుత్వ ధనం అంతాకూడా భగవంతుని కోసం ఖర్చు చేయడంతో గోలకొండ ప్రభువులు అతణ్ణి కారాగారంలో ఉంచారు. చివరికి ఆ భగవంతుని అండతోనే విడుదలయిన రామదాసు ఆ రాముని మీద అనేక కీర్తనలు రచించాడు. ప్రస్తుతం రామదాసు కీర్తనలు 120దాకా లభిస్తున్నాయి. ఈ కీర్తనలు భజన గోష్ఠులలో ఎక్కువగా పాడుతుంటారు. రామదాసు కీర్తనలతోపాటు 'దాశరథీశతకం' కూడా రచించాడు. ఇది ఆంధ్రదేశం లోమంచి ప్రచారాన్ని పొందింది.

**త్యాగరాజు :** త్యాగరాజు క్రీ. శ. 1767వ సంవత్సరంలో జన్మించి క్రీ. శ. 1847వ సంవత్సరం వరకు జీవించాడు. ఇతని జన్మస్థానం తంజావూరులోని తిరువాయూరు. త్యాగయ్య రామభక్తుడు. చిన్ననాటి నుండే తల్లిదండ్రుల ఉపదేశాలతో రామునిమీద భక్తిని అలవరుచుకున్నాడు ఆభక్తిపారవశ్యాలలోనే 24,000 కీర్తనలదాకా రచించాడు. ఆంధ్రదేశం లో రామమందిరంలేని గ్రామంగాని, త్యాగయ్య కీర్తన వినిపించని సంగీత సభగాని ఉండదంటే—అతిశయోక్తికాదు. త్యాగరాజు శాస్త్రీయసంగీతానికి ఎక్కువగా ప్రాధాన్యం ఇచ్చినట్లుగా కనిపిస్తుంది, ఇంతకుముందు కాలంలో ప్రచారంలోలేని ఖరహరప్రియ, హరికాంభోజి, చక్రవాకము, షణ్ముఖ ప్రియ, మొదలైనరాగాలను త్యాగరాజు వెలుగులోకి తీసుకొని రావడం జరిగింది.[1] త్యాగరాజు సృష్టించిన ఘనరాగ పంచరత్నములు నిరుప మానమైన ప్రచారమును పొందినవి, ప్రహ్లాద భక్తివిజయము, సీతారామ

---

1 విజ్ఞానసర్వస్వం (4వ సం, పేజి–1077)

విజయము, నౌకాచరిత్రము, అను మూడు సంగీత నాటకములను కూడా త్యాగరాజు రచించాడు.

తెలుగులో, సంకీర్తన సాహిత్యానికి వన్నెతెచ్చిన ఈ వాగ్గేయకారుల కోవకు చెందినవాడే పాలమూరు జిల్లా కోటకదిరె గ్రామంలో జన్మించిన మన్నెంకొండ హనుమద్దాసు. ఇతడు మన్నెంకొండ లక్ష్మీవేంకటేశ్వర స్వామికి గోపుర ప్రాకారాదులను నిర్మించాడు. రామునిమీద మనోహర మైన కీర్తనలు రచించి తెలుగు వాగ్గేయకారుల సరసన నిలిచిన మహా భక్తుడు హనుమద్దాసు. ఇతని జీవితాన్ని, కీర్తనలను అనుశీలించి చూపడమే ప్రస్తుతాంశం.



# మన్నెంకొండ పరిచయం

పుణ్యక్షేత్రాలకు ఆంధ్రదేశం పెట్టింది పేరు. ఆ ఆంధ్రదేశం లోని తెలంగాణ ప్రాంతంలో ఉన్న ముఖ్యమైన పుణ్యక్షేత్రాల్లో మన్నెంకొండ ఒకటి. ఇక్కడ నెలకొన్న దైవం శ్రీలక్ష్మీవేంకటేశ్వర స్వామి, మన్నెంకొండ మహబూబ్‌నగర్ జిల్లాకు చెందింది. ఈజిల్లాకు 'పాలమూరు' అనే పేరుకూడా వ్యవహారంలో ఉంది. మన్నెంకొండలోని దేవాలయాన్ని, ఈప్రాంతాన్ని, కీర్తనలద్వారా వెలుగులోకి తీసుకొనివచ్చిన, మహాభక్తుడు హనుమద్దాసు. ఈయన మన్నెంకొండ దగ్గరలోని కోట కదిరె అనే గ్రామంలో జన్మించాడు.

# హనుమద్దాసు పూర్వులు

హనుమద్దాసు అలహరి వంశానికి చెందినవాడు. ఈ వంశానికి మూలపురుషుడు భక్తశ్రేష్ఠుడైన కేశవయ్య. ఇతడు తమిళదేశంలోని

---

మన్నెంకొండ హనుమద్దాసు చరిత్రి—శ్రీనృసింహకవి ; గ్రంథం ఆధారంగా స్థానికులు తెలిపిన విషయాల ఆధారంగా "మన్నెం కొండ హనుమద్దాసు జీవిత విశేషాలు" అనే ఈ అధ్యాయం రచించడం జరిగింది. (అనుబంధంలో అలహరి వంశీయుల వంశవృక్షం ఇవ్వడం జరిగింది.)

శ్రీరంగం దగ్గర అలహరి అనే గ్రామంలో జీవించేవాడు. ఒక సారి శ్రీవేంకటేశ్వరస్వామి కేశవయ్యకు కలలోకనిపించి మన్నెంకొండ వెళ్ళమని ఆదేశించాడు. స్వామి ఆజ్ఞను శిరసావహించి కేశవయ్య కుటుంబ సమేతంగా కోటకదిరె గ్రామానికి వచ్చి మన్నెంకొండ లక్ష్మీవేంకటేశ్వర స్వామిని దర్శించి, సేవిస్తూ ఇక్కడే స్థిరపడిపోయాడు. ఈ అలహరి వంశంలోనే మహాభక్తుడు, వేదాంతి అయిన వెంకయ్య జన్మించాడు. ఇతని భార్య కృష్ణమాంబ. ఈ దంపతులకు శ్రీహరి కటాక్షం వల్ల మేఘయ్య, పాపయ్య మొదలైన ఎనిమిది మంది సంతానం కలిగారు. వీరిలో అందరికంటే చిన్నవాడు సంకీర్తనాపరుడయిన హనుమద్దాసు. ఈ హనుమద్దాసు పూర్వజన్మలో ఎత్తపు రామయోగి అనే పేరుతో జీవించాడని ప్రసిద్ధి. ఎత్తపు రామయోగి అనే మునిపుంగవుడు శేష పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న సమయంలో ఒకసారి,

"కుమార నీకొకవిషయం చెప్తాను విను—నీవు విష్ణుసాన్నిధ్యాన్ని కోరినట్లయితే ఈ జన్మలో నీకదిసిద్ధించదు. ఎవరికైనా పూర్వకర్మను దాటడం సాధ్యంకానిపని. కనుక నీవు మన్నెంకొండకు వెళ్ళి అక్కడి స్వామి పుష్కరిణి సమీపంలో 600 సంవత్సరములు తపస్సు చేసిన మీదట, హరిభక్తుడయిన వెంకయ్య దర్శనమవుతుంది. అతనిచేత అనుదినమూ పాలు తెప్పించుకొని త్రాగి, కొన్నినెలలు జీవించిన తరువాత నిర్మలాత్మకులైన ఆ వెంకయ్య, కృష్ణాంబ దంపతులకు అష్టమ సంతానంగా జన్మిస్తావు. ఆ జన్మలోనే మహాభక్తుడవై రామకీర్తనలు రచించి గానంచేసి, చివరకు ప్రాయోపవేశంద్వారా తనువు చాలించి మోక్షాన్ని పొందుతావు" 1 అనే అశరీరవాణి పలుకులు వినబడ్డాయి. ఆ మాటలు విన్న రామయోగి శేషపర్వతం మీద తన తపస్సును చాలించి మన్నెంకొండకు బయలుదేరి వచ్చి అక్కడ కఠోరమైన తపస్సు చేశాడు. ఒక రోజున స్నానాదికాలకై స్వామి పుష్కరిణి వైపు వెళ్తున్న సమయంలో

1 మన్నెంకొండ హనుమద్దాసు చరిత్ర పేజి—10

మహాభక్తుడైన వెంకయ్య కనిపించాడు. అప్పుడా యోగి పుంగవుడు వెంకయ్యతో నేను ఇక్కడ చాలాకాలంగా తపస్సు చేసుకుంటున్నాను, ఇన్నాళ్ళ తర్వాత పుణ్యాత్ముడవైన నీ దర్శనం లభించింది. ఇక నేను ఇక్కడి నుంచి శేషపర్వతం మీదకి వెళ్ళిపోతాను అనడంతో, వెంకయ్య తాను విషయం రహస్యంగా ఉంచుతానని దయచేసి ఇక్కడి నుంచి వెళ్ళవద్దని ఆ యోగీశ్వరుని కోరాడు. అందుకు నత్తృప్తు రామయోగి నీవు ఒక సంవత్సరం పాటు నాకు పాలు తెచ్చి ఇవ్వు, ఆ తర్వాత నేను నీకు కుమారుడిగా జన్మిస్తాను అని చెప్పాడు. అందుకు సంతోషించిన వెంకయ్య ప్రతి దినం పాలు తీసుకొని వచ్చి ఆయోగి పుంగవుడికి అందచేస్తూ ఉండేవాడు. ఈ విధంగా ఒక సంవత్సరము గడిచిన తర్వాత ఒకనాడు పురజనులంతా ఆమహానుభావుని చూడవచ్చి గుసగుసలు పోవడంతో, ఆ మునీంద్రుడు వెంకయ్యతో ఇకనేను రహస్యంగా మనడం కష్టం కనుక నీవు నీగ్రామానికి వెళ్ళు, కొంత కాలం తర్వాత నేను నీకు కుమారుడుగా జన్మిస్తాను. అని చెప్పి ఎవరికీ కనిపించకుండా వెళ్ళిపోయాడు.

## హనుమద్దాసు జననం

ఈ విధంగా రామయోగీంద్రుల ఆజ్ఞ పొందిన వెంకయ్య ఆ గుండంలో స్నానంచేసి మన్నెంకొండ శ్రీహరిని దర్శనచేస్తూ తన స్వగృహానికి వచ్చాడు. కొంత కాలానికి కృష్ణాంబ గర్భవతి అయింది. ఆ తరువాత క్రీ. శ. 1814, శ్రీముఖ నామ సంవత్సరం, శ్రావణ మాసం కృష్ణాష్టమినాడు రోహిణీ నక్షత్రంలో ఆమె ఒక బాలుణ్ణి ప్రసవించింది. ఆ బాలుడు తల్లి గర్భంలో ఉన్నప్పటి నుంచే హరినామస్మరణం చేసేవాడు. జన్మించిన ఇరవై ఒక్క రోజున పెద్దలంతా కలిసి నామకరణోత్సవం చేసి ఆ బాలునికి 'హనుమద్దాసు' అని పేరు పెట్టారు.

హనుమద్దాసు ఐదు సంవత్సరాలు నిండిన తర్వాత అతని ముఖంలోని తేజస్సును చూసి తల్లిదండ్రులు అతడు భగవంతుని వరప్రసాదం

అనిభావించి అతనికి చదువు సంధ్యలు నేర్పించడం మొదలుపెట్టారు. కాని హరినామ సంకీర్తనంలో మునిగి తేలే హనుమద్దాసుకు చదువు అంతగా ఒంట బట్టలేదు. శ్రీహరిని కీర్తిస్తూ ఎక్కడెక్కడో తిరిగేవాడు. ఏమేమోచేసేవాడు, ఏదేదోమాట్లాడేవాడు. భగవంతునిమీద ధ్యానతో తానేం చేస్తున్నాడో తనకేతెలియకుండా ప్రవర్తించేవాడు.

కొంతకాలం తర్వాత హనుమద్దాసుకు తత్త్వదర్శనంమీద కోరిక కలిగి, కోటకదిరె గ్రామంలో నివసిస్తున్న మైసూరు లక్ష్మాంబ దగ్గరికి వెళ్ళి అజ్ఞానంలో ఉన్న తనకు పరతత్త్వరహస్యాలను బోధించి కృతార్థుణ్ణి చేయమని కోరాడు, అప్పుడు లక్ష్మాంబ ఎంతో సంతోషించి 'నాయనా నీవు శ్రీరామచంద్రమూర్తికి అత్యంత ప్రీతిపాత్రుడవవుతావు' అని దీవించి, అతనికి అనేక తత్త్వార్థ రహస్యాలు బోధించి 'వత్సా నీజీవితం చివరివరకు ఆ రామనామాన్నే స్మరిస్తూ ఉండు' అని, ఆ మహాభక్తునికి రామనామ ప్రాభవాన్ని వివరించి చెప్పింది. గురువుగారు దయతో అనేక విధాలుగా భగవంతుని మహిమలను గురించి చెప్పినందుకు హనుమద్దాసు ఎంతో సంతోషించి, హరిని ధ్యానిస్తూ గురువును కీర్తించాడు.

హనుమద్దాసు భగవన్నామ స్మరణమే జీవితానికి ఆధారమని, పరమార్థాన్ని తలచి హరినామ స్మరణచేస్తూ గురువు దగ్గర అనుమతి పొంది తనస్వగ్రామానికి బయలుదేరి వచ్చాడు, ఈవిధంగా గురువు వద్ద పరమార్థతత్త్వాన్ని తెలుసుకొని వచ్చిన హనుమద్దాసు, భక్తి జ్ఞాన వైరాగ్యాలు తనలో నిండి పోవడంతో చివరికి ఆ భగవంతుని భజనలోనే కాలం గడుపుతుండేవాడు.

హరినామ స్మరణలో నిమగ్నమైన హనుమద్దాసు వెంట అతని సోదరుడు పాపయ్య ఎప్పుడూ ఉండేవాడు. హనుమద్దాసు భద్రాచల యాత్రకు బయలు దేరడంతో పాపయ్యకూడా సోదరుని వెంట బయలు దేరాడు. మేఘయ్య మన్నెంకొండలోని స్వామి సేవలో నిమగ్నుడయ్యాడు

## భద్రాచలయాత్ర

హనుమద్దాసు హరినామ కీర్తనం చేస్తూ భద్రాచలయాత్రకు ప్రయాణం కావడంతో ఈభక్తాగ్రగణ్యుని వెంట సత్పురుషులు, భక్తులు సాధువులు, కదలివచ్చారు. రామనామం జపిస్తూ హనుమద్దాసు బృందం భద్రాచలం వైపుగా ప్రయాణించారు వారు ఆప్రయాణంలో ఒకనాటి రాత్రి దారితప్పి ఒక అరణ్యం ప్రవేశించారు. భయంకరమైన క్రూరమృగాలతో నిండిన ఆ అరణ్యాన్ని చూసి భక్తబృందం భయపడుతుంటే హరిని మనసులో నిలుపుకొని ధ్యానం చెయ్యండి మనకు ఏకష్టమూ రాదు అంటూ హనుమద్దాసు వారికి ధైర్యం చెప్పి ఆశ్రీరామచంద్రుని కరుణించమని వేడుకొన్నాడు.

దారిచూపమని అర్థించిన హనుద్దాసును కరుణించి ఆ భగవంతుడే ఒక చెంచువాని రూపంలో వచ్చి ఒక మార్గాన్ని చూపించి ఈ దారివెంట వెళ్ళండి భద్రాచలం చేరుకుంటారు. అనిచెప్పి అదృశ్యుడయ్యాడు. అప్పుడు హనుమద్దాసు వచ్చినవాడు భగవంతుడే అని లేకపోతే ఇంతరాత్రి వేళ ఈ అరణ్యంలో ఇతరులెవరూ సంచరించరని భావించి రామనామాన్ని స్మరిస్తూ త్వరితగతిని భద్రాచలం ప్రవేశించి, అక్కడ వరద రామాదాసు గారి గృహానికివెళ్ళాడు, ఆక్షణంలో సాధుజనులు అందరూ కూడా భగవంతుని భజన చేస్తుంటే హనుమద్దాసు ఆనందంతో ఆ రాత్రి అక్కడే బసచేసి హరినామ సంకీర్తనంలోనే ఆ రేయంతా గడిపాడు.

మర్నాడు ఉదయాన్నే పరిజనులతో కలసి గోదావరి నదికెళ్ళి స్నానదికాలు పూర్తి చేసుకొని ఎంతో సంతోషంతో ఆ శ్రీహరిని దర్శన చేశాడు. అప్పుడు ఆ సీతాపతే వైష్ణవరూపంలో అక్కడికి వచ్చి హనుమద్దాసును రమ్మని కొండపైకి తీసుకెళ్ళాడు. హనుమద్దాసు వెంట అతని సోదరుడు పాపయ్య ఇతర పరిజనం అందరూ కూడా హరినామ స్మరణం చేస్తూ దేవాలయంలోకి వెళ్ళారు. హనుమద్దాసును కొండపైకి తీసుకెళ్ళిన వైష్ణవోత్తముడు, స్వామిదేవాలయంలోకి వెంటబెట్టుకొని వెళ్ళి అతనితో నీవు 'వరపుత్రుడవు' అని చెప్పి, అతనికి అనేకరకాలైన భగవంతుని ప్రసాదాలిచ్చాడు. ఆతర్వాత హనుమద్దాసు, కొంతకాలం పాటు ఇక్కడే ఉండి స్వామిని సేవించమన్న ఆ వైష్ణవశ్రేష్ఠుని ఆజ్ఞననుసరించి ఆ భద్రాచలరాముని సన్నిధిలోనే భజనచేస్తూ కాలం గడిపాడు.

ఈవిధంగా హనుమద్దాసు భద్రాచలంలోనే ఉంటూ హరినామ స్మరణ చేస్తూ ఒకనాడు 'భజనానందసమాధి' లో ఉన్నప్పుడు ఆ హరి ప్రత్యక్షమై 'నువ్విక నీ స్వస్థానానికి వెళ్ళు' అనిచెప్పాడు. అప్పుడు హనుమద్దాసు కళ్ళుతెరిచి చూస్తేఏమీ కనిపించక పోవడంతో మళ్ళీ కళ్ళు మూసుకొని ఆ భగవంతుని దర్శించి కీర్తించాడు. ఆ తరువాత భగవంతుని ఆజ్ఞను శిరసావహించి అక్కడి హరిదాసులకు మొక్కి పోయివస్తానని చెప్పి బయలుదేరి, రామభజన మరచిపోకుండా తన స్వగ్రామమైన కోటకదిరె వచ్చాడు ఆతర్వాత కొంతకాలం ఆరామునిధ్యానిస్తూ ప్రశాంతమైన మనసుతో గడుపుతూ, ఒకనాటి అర్ధరాత్రి హనుమద్దాసు, పాపయ్య మన్నెంకొండ వెళ్ళడానికి ఉద్యుక్తులై అరణ్యమార్గం గుండా ప్రయాణం చేస్తూకొంతదూరం వెళ్ళిన తర్వాత చీకట్లోదారి తప్పారు. అప్పుడు వారికి ఆజానుబాహుడైన ఒక దిగంబరయోగీశ్వరుడు దర్శన మిచ్చాడు. హనుమద్దాసు అతనికి చేతులు జోడించి నమస్కరించి అతని దగ్గరికి వెళ్ళబోగా హరి,హరి అంటూ ఆయోగి దారి కష్టంపడి పరుగెత్తడం ప్రారంభించాడు. అప్పుడు హనుమద్దాసు కూడా అతని

వెంట పరుగెత్తగా, కొంతదూరం వెళ్ళిన తర్వాత ఆ యోగిపుంగవుడు హనుమద్దాసును వారించి అతనికి 'పరంధామ, జయపరంధామ' అనే మంత్రాన్ని ఉపదేశించి, దీనిని నువ్వు మరచిపోకుండా జపించినట్లయితే సన్మహిమలు కలుగుతాయి, అని బోధించి అదృశ్యుడయ్యాడు హనుమద్దాసు ఆమహాత్ముడు వెళ్ళిన దిక్కుకు నమస్కరించి స్వస్థలానికి తిరిగి వచ్చి అప్పటినుంచి 'పరంధామ జయపరంధామ' అనే నామాన్ని వదిలి పెట్టకుండా భజన చేయడం మొదలుపెట్టాడు.

ఈ విధంగా హనుమద్దాసు సర్వకాల సర్వావస్థల్లోను పరంధామ మంత్రాన్ని జపిస్తూ మనస్సులో రాముని ధ్యానిస్తూ స్వేచ్ఛగా తిరుగుతుంటాడు. కొంతకాలం తర్వాత ఒకనాడు కొందరు సాధుజనులు 'అనంతగిరి' యాత్రకు వెళుతూ కోటకదిరెకు రావడంతో హనుమద్దాసు, పాపయ్య కూడా వారివెంట ప్రయాణమయ్యారు. వారంతా హరిభజన చేస్తూ ప్రయాణం ప్రారంభించి ముందుగా ధర్మపురం చేరుకున్నారు. అక్కడ దిక్కులు మార్మోగే విధంగా భగవంతుని భజించడం మొదలు పెట్టారు.

# మన్నెంకొండకు తిరిగిరావడం

ధర్మపురంలో భజనచేస్తున్న హనుమద్దాసు కళ్ళకు 'వేమన' కనిపించి అతను అనంతగిరి రానవసరంలేదని, మన్నెంకొండకే వెళ్ళి అక్కడి స్వామినే సేవించమని సలహా ఇస్తాడు. ఈహఠాత్పరిణామానికి హనుమద్దాసు ఆశ్చర్యచకితుడై హరిదాసులతో కలిసి శ్రీహరిని వర్ణన చేస్తూ మన్నెంకొండకు బయలు దేరి వచ్చాడు. అక్కడ స్వామి సన్నిధికి చేరి సాష్టాంగనమస్కారం చేసి ఆ రఘురాముడి నామసంకీర్తనం చేస్తూ భగవంతుని కీర్తించాడు. ఈవిధంగా స్వామిని ధ్యానిస్తున్న హనుమద్దాసు దగ్గరికి ఎంతో మంది భక్తులు వచ్చేవారు. ఆ శ్రీహరి మాహాత్మ్యం

వల్ల అక్కడికి వచ్చిన భక్తుల కోరికలన్నీ తీరుతుండేవి. స్వామికి ముడుపులు, మొక్కులు రావడం మొదలు పెట్టాయి. అక్కడ రకరకాల దేవతామూర్తుల విగ్రహాలు వెలిశాయి.

గద్దెగూడెం, కోటకదిరె, ధర్మపురం ప్రజలు ఎంతో కష్టపడి అరణ్యంలాగా ఉన్న మన్నెంకొండ ప్రాంతంలోని చెట్లు పొదలు అన్నీ కొట్టివేసి క్రూరజంతువులను తరిమివేసి ఆ ప్రదేశాన్నంతా శుభ్రం చేశారు. అటుతర్వాత హనుమద్దాసు శిల్పకారులను పిలిపించి ఆస్థలంలో స్వామికి కోవెలను, గొప్పగొప్ప ద్వారాలను మంటపాలను నిర్మించమని, వారికి తగిన పారితోషికం కూడా ఇస్తానని చెప్పడంతో, వారంతా కూడా ఎంతో సంతోషించి గోవిందనామ స్మరణం చేస్తూ ప్రాకార మహాద్వారాలు, అరుగులు, నిర్మలమైన ముఖమంటపాలు నిర్మించారు. పురజనులందరూ ఈ నిర్మాణాలను చూసి ఆశ్చర్యపోయారు. శిల్పకారులు హనుమద్దాసుకు నమస్కరించి, స్వామీ మీరు చేయమన్న పనులన్నీ చేశాం. మాకు సెల విప్పించండని అడగ్గా వారికి బహుమానాలు ఇప్పింపడానికి హనుమద్దాసు మనసులో శ్రీహరిని నిందాస్తుతి చేయడం మొదలుబెట్టాడు. 'ఓస్వామి నిన్ను నమ్ముకున్నవాడిని నన్నుకాపాడవయ్య' అని స్వామిని ప్రార్థిస్తుంటే ఆ శ్రీహరి చిత్రమేమిటోగాని ధనం ఎక్కడినుంచో ముడుపులు, మొక్కుల రూపంలో రాసాగింది. అప్పుడు హనుమద్దాసు శిల్పులను పిలిపించి వారికి తగిన బహుమానాలిచ్చి సాగనంపాడు.

ఆలయ ప్రాకారాదుల నిర్మాణం పూర్తికావడంతో హనుమద్దాసు పనివాళ్ళను రప్పించి పుష్కరిణిలో పూడిక తీయమని చెప్పాడు. వారు పనిలో నిమగ్నులై పూడిక తీస్తున్న సమయంలో అందులో స్వామి వారి పాదం ఉద్భవించింది. ఆపనివాళ్ళలో ఒకడు దానిని గమనించకుండా కాలితో తొక్కడంతో మూర్ఛపోయాడు ఇది చూసినపనివాళ్ళంతా భయపడి హనుమద్దాసు దగ్గరికి వచ్చి మొరపెట్టుకున్నారు. విషయం విన్న హనుమద్దాసు ఆశ్చర్యపడి, పాపయ్యను పిలిచి పూజాసామగ్రి తీసుకొని

రామభజన చేస్తూ పుష్కరిణి వద్దకు బయలుదేరాడు. భజనోత్సాహంతో గుండం దగ్గరికి వచ్చిన హనుమద్దాసు నీటిలో శ్రీహరి పాదాన్ని, పైనహరిరూపాన్నీ చూసి, భక్తితో సాష్టాంగనమస్కారం చేసి అర్ఘ్యపాద్య ధూపదీపనైవేద్యాలను ఇచ్చి పూలదండలు వేసి మంచిగంధం పూసి ఆస్వామికి మంగళహారతులు పాడాడు. ఈవిధంగా శ్రీహరి పాదానికి అర్చనలు నమస్కారాలుచేసి ఆపాదతీర్థాన్ని మూర్ఛపోయిన వానిమీదచల్లగానే నిద్రలోంచి మేల్కొన్న విధంగా లేచాడు. ఇదిచూచి సర్విజలంతా కూడా హనుమద్దాసును కీర్తించారు. అప్పుడు హనుమద్దాసు వారితో, 'పూర్వ కాలంలో శ్రీహరిపాదచారియై వచ్చి ఇక్కడ నీరులేదని తెలిసి తానునిలిచి, తన పాదంతో తొక్కడంతో, ఆ పాదం గుర్తుగా గంగ ఉద్భవించింది. అది మొదలు ఇది పుణ్యతీర్థమై అలరారుతుంది. ఇందులో స్నానమాడిన వారికి మోక్షం సిద్ధిస్తుంది, కోరినకోరికలన్నీ తీరుతాయి.' అని స్వామి పుష్కరిణి మాహాత్మ్యాన్ని గూర్చి తెలియజేశాడు.

## దిగుడుకోనేరు నిర్మాణం

ఒకనాడు హనుమద్దాసుకు మనస్సులో ఒక ఆలోచన వచ్చింది. పుణ్యతీర్థాల్లో నీటికొరత ఏర్పడితే భక్తులు ఎక్కువగా ఇక్కడికి రావ డానికి ఇష్టపడరు. జలం సమృద్ధిగా ఉన్నచోటనే జనసందోహం కూడా ఎక్కువగా వుంటుంది కాబట్టి, దిగుడు కోనేరు నిర్మాణాన్ని సాగించాలని హనుమద్దాసు దానికి పూనుకున్నాడు. ఈవిషయాన్ని పురజనులకు తెలియ చేయడంతోవారు ఈప్రాంతంలో నీళ్ళుపడవనిచెప్పారు. దానికి హనుమద్దాసు గట్టునడుమ నీళ్ళు పడటమే మాహాత్మ్యం, ఇక్కడ త్రవ్వండి అంటూ ఒక ప్రదేశం చూపించాడు. అతని మాట ప్రకారం వాళ్ళు అక్కడ త్రవ్వగా రాళ్ళు తప్ప నీళ్ళు కనిపించలేదు, అప్పుడు హనుమద్దాసు ఒంటి కాలిమీద నిలబడి తొమ్మిది రోజులు హరినామ స్మరణ చేశాడు. అందులో ఒకనాటి రాత్రి మొదటి ఝాములో, వజ్రవైఢూర్యాలను ధరించి, కాలిమువ్వల శబ్దాలు లయబద్ధంగా వినిపిస్తుంటే, ఇద్దరు

అప్సరసలు వచ్చి ఒక తాటిచెట్టు సమీపంలో నిలబడి, హనుమద్దాసును పిలిచి నీకు శ్రీహరి కటాక్షం లభించింది. నీమాట చెల్లించుకున్నావు అవి పొగిడి ఈ ప్రాంతంలో తవ్వినట్లయితే నీరు పడుతుందని, తాము నిలుచున్న ప్రాంతాన్ని చూపించి అదృశ్యులయ్యారు.

అప్సరసల మాటలు విన్న హనుమద్దాసు లేచి వేగంగా స్వామివారికి అభిముఖంగా నడవడంచూసి, పురజనులంతా కూడా ఇదేదో విచిత్రంగా ఉందని పారలు తట్టలు పట్టుకొని అతని వెంట బయలుదేరారు. హనుమద్దాసు ఆనందంతో భగవంతుని కీర్తిస్తూ అప్సరసలు చూపించిన ప్రదేశాన్ని పురజనులకు చూపి అక్కడ తవ్వమని ఆదేశించాడు. వారంతా కూడా గోవిందనామ స్మరణచేస్తూ కోనేరు తవ్వడం సాగించారు. కొద్దిసేపైన తరువాత అక్కడ స్వచ్ఛందమైన జలపడింది. అప్పుడు హనుమద్దాసు, కోనేరుకు సోపానాలు నిర్మించమని చెప్పి, వారందరికి విలువైన బహుమతులిప్పించి, తాము భగవద్భజనచేస్తూ కొండమీదికి వెళ్ళాడు.

దేవాలయంలోకి ప్రవేశించిన హనుమద్దాసు స్వామికి రథోత్సవం చేయాలనుకొని, అది ఎలానిర్వహించాలో తెలియక బాధపడుతున్న సమయంలో, ఆ శ్రీహరే హనుమద్దాసుకు కలలో కనిపించి నీవు చేసే ఈ ఉత్సవం నా అనుగ్రహంచేత నిర్విఘ్నంగా కొనసాగుతుందని చెప్పి అంతర్ధానమయ్యాడు.

# స్వామివారికి బ్రహ్మోత్సవాలు

కొంతకాలం తరువాత ఒకనాడొక మునిసర్యుడు, హనుమద్దాసు దగ్గరికొచ్చి సాధుపుంగవులు తనను పంపించారని చెప్పి, హనుమద్దాసుతో 'నీకు శాశ్వతంగా హరిపథం సమకూరాలంటే, స్వామి వారికి ఘనంగా బ్రహ్మోత్సవాలు నిర్వహించు. ఇది మహర్షుల ఆజ్ఞ' అని హితోపదేశం

చేసి అదృశ్యుడయ్యాడు. మహర్షుల ఆజ్ఞమేరకు హనుమద్దాసు మన్నెం కొండ లక్ష్మీవేంకటేశ్వర స్వామికి బ్రహ్మోత్సవాలు నిర్వహించాడు. బ్రహ్మోత్సవాల సమయంలో ప్రతిరోజు రాత్రి హనుమద్దాసు, హరిదాసులు భక్తులు అందరితో కలిసి భక్తితో సాధుజనులు అందరూ వినేవిధంగా హరిభజన గావించాడు. బ్రహ్మోత్సవాల్లో ఒక భాగంగా జరిగిన గరుడోత్స వానికి ప్రజలు తండోపతండాలుగా వచ్చారు. స్వామివారికి గరుడోత్సవం రథోత్సవం మొదలైన కార్యక్రమాలన్నీ నిర్వహించారు. ఎక్కడ చూసినా భజనలు, నృత్యసంగీత కార్యక్రమాలు, భగవంతుని కథాకాలక్షేపాలతో మన్నెంకొండ ప్రాంతం అంతా కూడా ఆనందోత్సాహాలతో నిండిపోయింది.

బ్రహ్మోత్సవాల సమయంలో మన్నెంకొండ స్వామికి ఎన్నో ముడు పులు, కానుకలు వచ్చాయి, సూగూర్‌రాజా 'రామేశ్వరావ్ భూపాల్' స్వామికి ముడుపుగా తొమ్మిది వందల రూపాయలు పంపించాడు. అది దైవానుగ్రహంగా భావించి హనుమద్దాసు భజనపరులను, హరిదాసులను వైష్ణవపరివారాలను, బ్రాహ్మణులను పిలిచి వారందరికి ఆనందం కలిగే విధంగా దక్షిణలిచ్చి పంపించాడు.

# హనుమద్దాసు జీవితంలో అద్భుత సంఘటనలు

ఒకనాడు హనుమద్దాసు ఒక చెట్టుక్రింద కూర్చొని భగవంతుని స్మరిస్తూ అజగరసమాధిలోకి వెళ్ళిపోయాడు. అప్పుడొక సర్పం వచ్చి హనుమద్దాసు శరీరాన్ని చుట్టుకొని అతని తలపై తన పడగను విప్పింది. ఇంతలో తమ్ముని వెతుక్కుంటూ వచ్చిన పాపయ్య ఆ సర్పాన్ని చూసి భయకంపితుడయ్యాడు. కొంతసేపటికి ఆ సర్పం హనుమద్దాసును విడిచి దగ్గరలోని పుట్టలోకి వెళ్ళిపోయింది. ఆ తరువాత కొంతసేపటికి హనుమద్దాసు సమాధిస్థితి నుండి బయటికి వచ్చాడు. అప్పుడు పాపయ్య

నిర్మలంగా ఉన్న తనతమ్ముని ముఖం చూసి ఇతడెవరో మామూలు వ్యక్తి కాదు, ఏదివ్య ఋషిపుంగవుడో ఈ రూపంలో ఇక్కడ జన్మించి ఉంటాడు. లేకపోతే పడగవిప్పిన మహాసర్పం కాటుపడకుండా తప్పించు కోవడం మామూలు మనుషులకు సాధ్యంకానిపని, అనుకొని ఆశ్చర్యా నందాలతో హనుమద్దాసుకు నమస్కరించాడు.

హనుమద్దాసు ప్రతి శనివారం మన్నెంకొండలోని కృష్ణవిలాస మండపంలో భజన చేసేవాడు. ఒకసారి భజన సమయంలో ఒక దివిటీ మూనె అయిపోవడంతో ఆరిపోయింది. అప్పుడు కొందరు భక్తులు నూనె కోసం వెళ్ళారు. అయితే హనుమద్దాసు స్వామి పుష్కరిణిలో నుంచి జలాన్ని తీసుకొచ్చి దివిటీలో పోసి వెలిగించాడు.

హనుమద్దాసు నిర్యాణం తరువాత ఒకరోజు పాపయ్య తనభార్య లక్ష్మమ్మతో కలిసి కొండ ఎక్కుతున్న సమయంలో వారికొక కుంకుమ భరిణ దొరికింది. వారిద్దరుకూడా అందులోని కుంకుమను తమనుదుట ధరించారు. వాళ్ళు కొద్దిదూరం నడిచేసరికి ధ్వజస్తంభం సమీపంలో మెట్లదగ్గర ఒక వేడివేడి రొట్టెముక్క దొరికింది. ఆ తరువాత ముఖ ద్వారం దగ్గరికి వచ్చేసరికి ఆ దంపతులకు అంతకు కొన్నిరోజుల క్రితమే మోక్షసిద్ధుడైన హనుమద్దాసు దర్శనం లభించింది.

హనుమద్దాసు భజన చేస్తున్న సమయంలో అతనిమీద పుష్పవర్షం కురిసేదట, అతడు తన తంబుర మీటకుండానే ధ్వనులను సృష్టించే వాడట, ఈ విధమైన మహిమలతో, భక్తిప్రపత్తులతో కూడిన హనుమ ద్దాసు కీర్తిప్రతిష్ఠలు దశదిశలా వ్యాపించాయి.

## సన్మానాలు

ముక్కర సోమవిభుడు హనుమద్దాసును పిలిపించి పరమేశ్వరుని సన్నిధిలో రామకీర్తనలు పాడించి, ఆనందపరవశుడై అతన్ని అమ్మకాన

చేర్చుకొని, ఆమహానుభావుని అనుమతితో భక్తియుక్తుడై అతనికి శాలువలు వస్త్రాభరణాలు, ఇచ్చి సత్కరించి పంపాడు.

సురపురం సంస్థానానికి చెందిన ఈశ్వరాంబ హనుమద్దాసు కీర్తిప్రతిష్ఠలు విని, తగినవారిని పంపించి అతన్ని తన గృహానికి పిలిపించింది. హనుమద్దాసు సురపురానికి వస్తుంటే ఆ ఊరిప్రజలందరూ హనుమద్దాసునకు సంతోషంతో స్వాగతం చెప్పారు. ఈశ్వరాంబ, హనుమద్దాసును గౌరవించి, ఎంతో ఆదరణతో పన్నెండు వందల రూపాయలు రొక్కం, రత్నఖచితమైన బంగారు ఉంగరం, ఇంకా రత్నపు జపమాల అన్నింటిని ఇచ్చి అతన్ని సత్కరించి పంపించింది.

లోకాయపల్లి సంస్థానానికి చెందిన రాణి లక్ష్మమ్మ కూడా హనుమద్దాసు పేరుప్రఖ్యాతులు తెలుసుకొని అతన్నిపిలిపించి గౌరవించింది. ఆ తరువాత హనుమద్దాసు మన్నెంకొండకు చేరుకున్నాడు. సూగూర్ సంస్థానాధీశుడైన రామేశ్వర మహీపాలుడు అక్కడకి వచ్చి హనుమద్దాసును చూసి నమస్కరించి, అతని ఆశీస్సులు పొంది, భగవంతుని సేవించి వెళ్ళాడు.

ఈ విధంగా మన్నెంకొండ నిత్యోత్సవాలతో విలసిల్లుతూ వచ్చింది. కొంతకాలానికి స్వామివారికి తిరునాళ్ళు చేయవలసిన సమయం రావడంతో, హనుమద్దాసు ఎంతో భక్తిప్రపత్తులతో తిరునాళ్ళ కార్యక్రమాన్ని నిర్వహించాడు. అందులో భాగంగా గరుడోత్సవం, రథోత్సవం భక్తితో నిర్వహించాడు. ఈ విధంగా ప్రతి సంవత్సరం కూడా స్వామి వారికి ఉత్సవాలు జరుగుతూనే ఉన్నాయి.

## శిష్యవాత్సల్యం

హనుమద్దాసు కీర్తిప్రతిష్ఠలు అన్నిచోట్ల ప్రచారం కావడంతో నాగర్ కందనూల్ ప్రాంతంలోని 'వందివడ్డమాను' అనే ఊరులో నివసించే

వేంకటదాసనే ఒక హరిదాసు మహాభక్తుడైన హనుమద్దాసు పేరు విని ఆయన దగ్గర పరమార్థోపదేశం పొందాలనుకొన్నాడు, అందుకోసం మన్నెంకొండ వచ్చి స్వామి పుష్కరిణిలో స్నానంచేసి, హనుమద్దాసు వద్దకు వచ్చి నమస్కరించాడు. 'గురుదేవా' అనిపిలిచే ఆ శిష్యుని హనుమద్దాసు వాత్సల్యంతో దగ్గరకు తీసుకొని, తారకరాముని ఎల్లప్పుడూ నిర్మలమైన మనస్సుతో ధ్యానిస్తూ ఉండమని, శుభం కలుగుతుందని అతన్ని దీవించి పంపాడు,

## భగవత్పరీక్ష

ఒకసారి ఆపరమేశ్వరుడే మహాభక్తుడైన హనుమద్దాసును పరీక్షింప దలచి వైష్ణవాచార్యులైన శ్రీకందాళ వారికి కలలో కనిపించి, హనుమద్దాసును పరీక్షించమని, తరువాతి విషయం తను చూసుకుంటానని ఆదేశించి అదృశ్యుడయ్యాడు. శ్రీరమణుడు ఆడిస్తున్న నాటకానికి కందాళవారు ఆశ్చర్యపోయాడు. ఇంతలో కొంతమంది దుర్మార్గులు హనుమద్దాసు కీర్తిప్రతిష్ఠలను సహించలేక కందాళవారి వద్దకు వచ్చి హనుమద్దాసును గూర్చి చెడుగా చెప్పారు. దానికి ఆ మహానుభావుడు, హనుమద్దాసు వద్దకు వెళ్ళాలని నిర్ణయించుకొని, శిష్యగణంతో కలిసి మన్నెంకొండకు ప్రయాణమై వెళ్ళాడు. కందాళవారి రాకనుచూసి హనుమద్దాసు అతనికి నమస్కరించి ఎంతో ఆదరణతో, భక్తిప్రపత్తులతో స్వాగతం చెప్పాడు. హనుమద్దాసుని వినయశీలానికి ముగ్ధుడైన కందాళవారు మనసులో 'ఇంతటి మహనీయుని, నేనేవిధంగా పరీక్షించగలను?' అయినప్పటికి ఆ భగవంతుని ఆజ్ఞను ధిక్కరించ కూడదు కదా! అని నిర్ణయించుకొని కనికరాన్ని విడిచిపెట్టి, హనుమద్దాసు మన్నెంకొండ మీద తన అధికారాన్ని దుర్వినియోగం చేస్తూ ఉన్నాడన్న మిషలో హనుమద్దాసును మన్నెంకొండ నుండి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు. అప్పుడు హనుమద్దాసు, 'భగవంతుడే మీ రూపంలో వచ్చి చెబుతుంటే నేనెలా ధిక్కరించగలను?' అంటూ మన్నెంకొండ విడిచి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఆ సమయంలో పురజనులందరూ వచ్చి హనుమద్దాసును ఆపడానికి ప్రయత్నించారు.

తీసుకురా! అతడు స్వప్నలాన్ని విడిచి పన్నెండునెలలు కావొస్తుంది. మన్నెంకొండ మహోత్సవాలు దగ్గరపడ్డాయి. అని చెప్పి స్వామి అదృశ్యుడయ్యాడు. కందాళవారు నిద్రనుంచి మేల్కొని ఆనందపరవశుడై పరిజనులందరికి స్వప్నవృత్తాంతాన్ని తెలియజేశాడు. ఆ తరువాత తన సన్నిధిలోని కొంత మందిని పంపి హనుమద్దాసును మన్నెంకొండకు రప్పించాడు.

మన్నెంకొండకు తిరిగివచ్చిన హనుమద్దాసు వెంట, హరిదాసులు, భజనపరులు, మొదలైన వారందరూ వచ్చారు. రామభజన చేస్తూ హనుమద్దాసు, కందాళ స్వామివారి సన్నిధికి వెళ్ళి నమస్కరించాడు. కందాళవారు హనుమద్దాసు రాకకు సంతోషించి, అతనితో మన్నెంకొండకు బయలుదేరి వచ్చాడు.

## భగవత్సాన్నిధ్యం

ఆ విధంగా కొంతకాలం గడిచింది. ఒకనాడు హనుమద్దాసు, హరిదాసులు పరిజనులందరితో కలిసి రామకథ వినడంలో నిమగ్నుడై ఉన్న సమయంలో, ఒక మునీశ్వరుడు అక్కడికివచ్చి హనుమద్దాసుని పిలిచి ఇంకా ఎంతకాలం ఈభవబంధాలకు లోబడి ఉంటావు! స్వామి సాయుజ్యం పొందవలసిన సమయం వచ్చింది. అని చెప్పి వెళ్ళిపోయాడు. మునివరుడు తెల్పిన విషయాన్ని మనసులో దీర్ఘంగా ఆలోచించి, హనుమద్దాసు ఆ మహనీయుని మాటలను తనసోదరులకు తెలియచేశాడు. ఈ వార్త జాతరంతాకూడా తెలిసిపోయింది. ఆ తరువాత హనుమద్దాసు ఇందిరేశునికి ఆత్మార్పణం చేసి అచల సమాధి స్థితిలో ఉండి అందరూ ఆశ్చర్యంతో చూస్తుండగానే దేదీప్యమానమైన విమానం ఎక్కి వైకుంఠానికి వెళ్ళిపోయాడు. ఈ లక్షణం విశిష్టాద్వైత సిద్ధాంతంలో చెప్పబడ్డ భగవత్సాలోక్యాన్ని వ్యక్తం చేస్తుంది.



మూడవ అధ్యాయం

# హనుమద్దాసు కీర్తనలు - భక్తితత్వం

# భక్తి

శ్లో॥ మోక్షసాధన సామాగ్ర్యాం భక్తిరేవ గరీయసి
స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే॥
(వివేక చూడా మణి శ్లో: 32 )

మోక్షాన్ని కోరేవారికి భక్తి నిరపాయ సాధనమార్గం, అశాశ్వత మైన ప్రపంచ విషయాలను వదిలిపెట్టి పరమార్థమందే మనస్సునిలిపి సోపానక్రమంలో ఆ పరమార్థంలో తన్మయీభావాన్ని పొందడం దీని లక్ష్యం, "సాతస్మిన్ పరమప్రేమ రూపా" భగవంతుని పై ప్రీతి ఉండడమే భక్తి. 1 భక్తిలో భక్తుడు తన్మయత్వం పొందుతాడు. నీవు తప్పనాకు అన్యం మరొకరు ఎవరూలేరనే భావనతో నిత్యం కాలం గడుపుతాడు. సర్వకాల సర్వావస్థల్లోను భగవంతుని స్తుతిస్తూ సేవిస్తూ కాలం గడుపుతాడు. అందువల్లనే మానవుని మోక్ష సాధనకు భక్తియే శ్రేష్ఠమైనదని భక్తజనులు వక్కాణిస్తుంటారు.

---

1 నారదభక్తి సూత్రాలు. సూ—2

ఏదైనా ఒకపని నెరవేరాలంటే అనుషంగిక కారణాలు కొన్ని ప్రధాన కారణాలు కొన్నిఉంటాయి. అనుషంగిక కారణాలు ప్రధాన కారణాలకు సహాయకారులుగా ఉంటాయి. మోక్షసోపానాన్ని అధిరోహించదలిచే ముముక్షువునకు కర్మయోగం, ధ్యానయోగం, జ్ఞానయోగం, భక్తియోగం అని నాలుగు మార్గాలు సూచించబడ్డాయి. ఏమార్గం వెంట నడిచినా చేరే గమ్యం మాత్రం ఒకటే. అయినా వీటిలో ఆధిక్య అనాధిక్యాలను గురించి జిజ్ఞాసువులలో విమర్శ ప్రారంభమైంది. జైమిని కర్మయోగ ప్రాధాన్యాన్ని, పతంజలి ధ్యానయోగ ప్రాధాన్యాన్ని, వ్యాసుడు జ్ఞానయోగ ప్రాధాన్యాన్ని, నారదుడు భక్తియోగ ప్రాధాన్యాన్ని విశేషంగా ప్రస్తావించారు. ఒక్కొక్కరు వారివారి సిద్ధాంతానుసారంగా సూత్రాలు రచించారు. కొందరు భాష్యకారులు కూడా అయ్యారు.

కర్మయోగం వల్ల చిత్తశుద్ధి. ధ్యానయోగం వల్ల ఏకాగ్రత, జ్ఞానయోగం వల్ల బ్రహ్మైక్యం,1 భక్తియోగం వల్ల బ్రహ్మానందానుభూతి చేకూరుతాయని వేదాంత విదులు వివరిస్తుంటారు. అయినా నారదుడు భక్తికే విశేషప్రాధాన్యాన్ని ఇచ్చాడు. భగవంతుని స్వరూపాన్ని తెలుకొన్నంత మాత్రంచేత ప్రయోజనం ఏమీలేదని, భక్తుడు సమస్త కర్మలను భగవంతుని యందు అర్పించి కామం, క్రోధం, అభిమానం, మొదలైన దుర్గుణాలను ఆ భగవంతుని యందే లయింప చేయాలని నారదుడు తనభక్తి సూత్రాల్లో వివరించాడు.2 ఎన్నితీర్థాలు సందర్శించినా ఎన్నివేదాలు వల్లించినా, ఎంత యజ్ఞయాగాదులతో కాలం గడిపినా, ఎన్ని భగవంతుని చిహ్నాలను ధరించినా భగవంతుని యందు అనన్యమైన భక్తిలేనిచో అన్నీవ్యర్థమే కాబట్టి, భక్తే నిరుపమానమైనదని చెప్పవచ్చు.

---

1 వేదాంత డిండిమం, శ్లో: 25

2 "తదర్పితాఖిలాచారః సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్." (నారదభక్తి సూత్రాలు—సూ—65)

భగవంతుని యథార్థతత్త్వమును తెలిసికొనుటకు సులభసాధనం భక్తి. ఇతర సాధనాలు కఠినాలని గీతలో శ్రీకృష్ణభగవానుడు చెప్పాడు.

శ్లో|| క్లేశో ధికతర స్తేషాం, అవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తాహి గతి ర్దుఃఖం, దేహవద్భి రవాప్యతే||
(భగ. అధ్యా: 12; శ్లో: 5)

## భక్తి పద నిర్వచనం

'భజ్' ధాతువు 'క్తి' ప్రత్యయంతో కూడగా భక్తిశబ్దము వెలువడింది. సేవచేయుట, భజించుట, అర్పించుట, ప్రేమించుట ఇత్యాదులు దీని అర్థం. 1

పండితులు భక్తి అనగా కేవలం ఈశ్వరోపాసన లేదా ఈశ్వరుని ప్రేమించుట అని పలికారు. ప్రాచీనభక్తి సూత్రకారులగు నారదాచార్యులు 'భగవంతుని యందలి పరమ ప్రీతియే భక్తి' 2 అని నిర్వచించారు. భగవంతుని పట్ల నిర్హేతుకం, నిష్కామం, నిరంతరమైన పరిశుద్ధప్రేమయే భక్తి అని భాగవత ప్రవచనము 3 స్వస్వరూపానుసంధానం లేదా ఆత్మ నిష్ఠయే భక్తి అని శ్రీశంకరాచార్యులవారు భక్తిని నిర్వచించారు.

భగవంతునిమీద భక్తిని పెంచుకున్న భక్తులలో కూడా భగవంతున కిష్టుడైన భక్తుడు కావాలంటే, భూతదయ, సమదృష్టి అహింస మొదలైన ఉత్తమ గుణాలతో జ్ఞాని అయి భగవంతుని మనసులో సర్వదా, సర్వథా స్మరించే అనన్య భక్తి కలిగి ఉండాలి. పరమాత్మను

---

1 విజ్ఞాన సర్వస్వం, సం: 7; పేజి–580
2 నారదభక్తి సూత్రాలు–సూ–2
3 శ్రీమద్భాగవతం 3–౨–11,12

దర్శించాలంటే ఈ అనన్యభక్తి కలిగి ఉండాలి. 1 ఈ అనన్యభక్తితో పాటుగా భక్తియోగ నిష్ఠుడైనవాడు భగవంతునకిష్టుడవుతాడు. ఈభక్తి యోగనిష్ఠుడికి ఉండవలసిన లక్షణాలను గురించి భగవద్గీతలో కృష్ణ భగవానుడు వివరిస్తూ, భక్తియోగనిష్ఠుడు సర్వభూతాల యందు ద్వేష భావములేకుండా, దయ సుహృద్భావాలు కలిగి ఉండాలి. అహంకార మ కారాలను విడిచి సుఖదుఃఖాలను సమానంగాచూసే ఓర్పుకలిగి ఉండాలి సర్వకాల సర్వావస్థల్లోను మనో నిగ్రహంతో జీవిత నిశ్చయాలను, మనోబుద్ధులను భగవంతుని కర్పించాలి. ఇట్టి భక్తుడే భగవంతునికి ఇష్టుడని క్రింది శ్లోకాలల్లో తెలియ చేశాడు.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః, సమదుఃఖసుఖః క్షమీ.
(భదవద్గీత. అధ్యా: 12; శ్లో: 13)

శ్లో॥ సంతుష్ట స్సతతం యోగీ, యతాత్మాదృఢ నిశ్చయః
మ య్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్తస్సమే ప్రియః
(భగవద్గీత. అధ్యా: 12 శ్లో: 14)

ఈ భక్తి యోగ నిష్ఠతను పొందడానికి భాగవతం నవవిధ భక్తి మార్గాలను సూచించింది.

శ్లో॥ "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్"
(శ్రీమద్భాగవతం, స్కం: 7; అధ్యా: 5; శ్లో: 23)

## శ్రవణం

నవవిధ భక్తిమార్గల్లో ప్రథమ సోపానం శ్రవణం. భగవంతుని కథలను వినడంలో ఆసక్తి, ఆయన నామరూపగుణాదులను వివరించే

1 భగవద్గీత, అధ్యాయం–11, శ్లోకం–54

హరికథలు పురాణాలు, ఉపన్యాసాలు వినడమే శ్రవణ భక్తి యొక్క ప్రధాన లక్షణం, లక్ష్యం. భగవంతుని కథలను విన్న తరువాతనే భగవంతుని మీద ప్రేమ, ప్రీతి కలుగుతుంది. కాబట్టి శ్రవణం భక్తిసాధనలో ప్రథమ సోపానమని చెప్పవచ్చు.

## కీర్తనం

భగవంతుని రూపగుణ లీలలను శ్రద్ధాభక్తులతో కీర్తిస్తూ అపరిమితానందాన్ని పొందడం, హరికథలను చెప్పడం, భగవంతుని మహిమలను ఇతరులకు తెలియచేయడం కీర్తన భక్తి లక్షణం.

## స్మరణం

సర్వకాల సర్వావస్థల్లోనూ భగవంతుని నామరూపగుణ లీలాదులను స్మరించడం. భక్తుడు తన ఇష్టానుసారం, తన ఇష్టదైవం యొక్క నామాన్ని స్మరిస్తూ ఉండడమే స్మరణభక్తి. ఈ నామస్మరణ నిరంతరం చేయవచ్చు. ఈ నామ ప్రభావంవల్ల ఎన్నోకార్యాలను సాధించిన ఎందరో భక్తుల చరిత్రలు మన పురాణాల్లో ఉన్నాయి. హృదయంలో భగవంతుని రూపాన్ని ధ్యానించడం కూడా స్మరణభక్తే అవుతుంది.

## పాదసేవనం

భక్తుడు సద్గురు చరణాల్ని ఆశ్రయించి భగవంతుని సేవచేయడం. భగవంతుని దివ్య మంగళం విగ్రహాన్నో లేక ఆయన పాదారవిందాలనో పూజించడం, సేవించడం, త్రికరణ శుద్ధిగా భగవంతుని చరణాలకు తన జీవితాన్ని అంకితమివ్వడమే పాదసేవన మనబడుతుంది.

## అర్చనం

భగవంతునికి చేసేపూజ 'అర్చనభక్తి' అనబడుతుంది. అర్చావతా

త్రాన్ని. 1 గాని భగవంతుని చిత్రపటాన్ని గాని ముందుంచుకొని నానా విధాలైన ఉపచారాలతో, సేవలతో ఆ స్వామిని పూజించడం. తన ఇష్ట దైవానికి ఒక రూపాన్ని ఏర్పరుచుకొని అనుక్షణం త్రికరణ శుద్ధిగా ఆ రూపాన్నే సేవించడం అర్చన భక్తిలక్షణం.

## వందనం

భగవంతునికి సాష్టాంగ దండ ప్రణామాలాచరించడం వందన భక్తిలక్షణం. అష్టాంగాలు నేలకు తగిలే విధంగా దండంలాగా భూమిమీద పడి నమస్కరించడం సాష్టాంగ నమస్కారం. తన ఇష్ట దైవానికి త్రికరణ శుద్ధిగా నమస్కరించడమే వందనభక్తి. వందనభక్తి వినయాన్ని సూచిస్తుంది.

## దాస్యం

భగవంతుణ్ణి తనకు యజమానిగా తాను భగవంతునికి సేవకుడిగా భావించుకోవడం దాస్యభక్తి లక్షణం. పరమాత్మ రూపగుణాలను అర్థం చేసుకొని అనవరతం ఆభగవంతుని పట్ల సేవాభావంతో మెలగడమే దాస్యభక్తి.

## సఖ్యం

భగవంతుని తన స్నేహితునిగా భావించడం సఖ్యభక్తి. స్నేహంద్వారా అనుక్షణం ఆపరమాత్మ సన్నిధిలో ఉంటూ, ఆస్వామిని సేవిస్తూ ఆయిన కిష్టమైన పనులనే చేస్తూ భగవంతుని అభీష్టానుసారంగా నడుచుకుంటూ సర్వకాల సర్వావస్థల్లో స్వామి సమక్షంలో కాలంగడపడమే సఖ్య భక్తిలక్ష్యం.

---

1 ఈశ్వరుడు పంచమూర్తిత్వము కలవాడు. 1 పరవాసుదేవ స్వరూపము, 2 వ్యూహము, 3 విభవము, 4 అంతర్యామి, 5 అర్చారూపము. వైష్ణవాంధ్ర వాఙ్మయము పేజి–44, 45

# ఆత్మనివేదనం

నవవిధ భక్తులలో చివరి భక్తిమార్గం ఆత్మనివేదనం. భగవంతుని యొక్క సకల మహిమలను, లీలను తెలుసుకొని, ఆయన అనంతత్వాన్ని నమ్మి, తనలోని అహంకార మమకారాలను చంపి నిష్కపటంతో నిస్వార్థంతో పరమాత్మకు సర్వాత్మ సమర్పణం చేయడమే ఆత్మనివేదనం. ఆత్మనివేదనంలో భక్తునికి నాది అనేభావం ఉండదు. సర్వం పరమాత్మ మయంగా కనిపిస్తుంది. భగవంతుడు అనంతుడుగా కనిపిస్తాడు. స్వామికి తనను తాను పూర్తిగా అర్పించుకుంటాడు.

నవవిధ భక్తి మార్గాల్లో చూపించిన శ్రవణం, కీర్తనం, స్మరణం పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం అనే భక్తిమార్గాల్లో కొన్ని ఒకదానిలో నుండి ఒకటి ఉద్భవించినట్లుగా, ఒకటి మరోదానిలో అంతర్భవిస్తున్నట్లుగా కనిపిస్తుంది. కీర్తనభక్తి, స్మరణభక్తి పాదసేవనభక్తి, అర్చనభక్తి, ఆత్మనివేదన భక్తి ఇవన్నీ దాస్యభక్తిలోనే మిళితమవుతాయని చెప్పవచ్చు. కీర్తనల ద్వారా భగవంతుని సేవించే కీర్తనభక్తి, సర్వకాల సర్వావస్థల్లో భగవంతుని స్మరణలోనే కాలం గడపమని ఆదేశించే స్మరణభక్తి, భగవంతుని చరణారవిందాలను సేవించే పాదసేవనం అర్చారూపాన్ని పూజించే అర్చనభక్తి, సర్వాత్మ సమర్పణం చేసుకొనే ఆత్మనివేదనం, వీటన్నిటిలో భగవంతుని పట్ల భక్తుడు ప్రదర్శించే సేవ్య సేవకభావం ప్రస్ఫుటమవుతూనే ఉంటుంది. కాబట్టి ఇవన్నీకూడా దాస్యభక్తిలోనే అంతర్భవిస్తాయని చెప్పవచ్చు.

భాగవతంలో సూచించిన నవవిధ భక్తిమార్గాల్లో కాకుండా ఇంకా చెప్పుకోవలసినవి వాత్సల్యభక్తి, మధురభక్తి, నిందాస్తుతి మొదలైనవి ఉన్నాయి.

## వాత్సల్యభక్తి

భగవంతుని తనకుమారునిగాను, తాను ఆ పరమాత్మకు తల్లిగానో తండ్రిగానో ఊహించుకొని, అనుక్షణం ఆ స్వామిసేవలోనే కాలం వెళ్ళబుచ్చటం వాత్సల్యభక్తి యొక్క లక్షణం.

## మధుర భక్తి

భగవంతుని ప్రియునిగా, తాను ప్రేయసిగా ఊహించుకొని, భక్తుడు పరమాత్మ పట్ల అనురాగంతో ఉంటూ ఆయన అనుగ్రహాన్ని పొందడానికి చేసే ప్రయత్నమే మధురభక్తి.

## నిందాస్తుతి

భగవంతుని మీద నిండైన ప్రేమను, భక్తిని పెంచుకొన్న భక్తుడు అనుక్షణం ఆస్వామి సేవలోనే గడుపుతూ, తనకేదైనా కష్టం వచ్చినప్పుడు ఆ భగవంతునే శరణువేడ్తాడు. ఆసమయంలో భగవంతుడు రక్షించక పోవడంతో భక్తుడు పరమాత్మను స్తుతిస్తూనే నిందిస్తాడు. ఆ నిందలో అంతర్గతంగా స్వామి యొక్క స్తుతి కనిపిస్తూనే ఉంటుంది. ఇదే నిందాస్తుతి అనబడుతుంది.

భగవంతుని సేవించే భక్తుడు అనేక రకాలైన మార్గాలను ఎన్నుకుంటాడు. అనుక్షణం ఆస్వామి సేవలోనే తనబ్రతుకు వెళ్ళబుచ్చు కోవడానికి ప్రయత్నిస్తాడు. ఆవిధంగా భగవంతుని సేవించే భక్తిమార్గాల్లో ప్రధానంగా కనిపించేవి వాత్సల్యభక్తి, మధురభక్తి, దాస్యభక్తి నిందాస్తుతులు హనుమద్దాసు కీర్తనల్లోకూడా ప్రధానంగా కనిపించేవి వాత్సల్యం, మధరభక్తి, దాస్యభక్తి నిందాస్తుతులే అని చెప్పవచ్చు.

హనుమద్దాసు రామునిమీద కీర్తనలు రచించాడు. ఇతడి కీర్తనలు పల్లవి, అనుపల్లవి చరణాలతో కూడి ఉంటాయి. రెండు పాదాలతోను, నాలుగు పాదాలతోను కూడిన పల్లవులు హనుమద్దాసు కీర్తనల్లో కనిపిస్తాయి. కొన్ని కీర్తనలలో అనుపల్లవి కూడా ఉంటుంది. చరణాల సంఖ్యకు మాత్రం నిర్దిష్టత కనిపించదు. అక్కడక్కడ ప్రాసను గమనించ వచ్చు. హనుమద్దాసు కీర్తనలలో పల్లవిలో చెప్పబడిన భావం అనుపల్లవి, చరణాలలో వివరింపబడుతూ ఉంటుంది. కీర్తన చివర హనుమద్దాసు స్వనామాంకితమైన ముద్ర కనిపిస్తుంది. ఈ విధమైన నిర్మాణరీతిలో సాగిన హనుమద్దాసు కీర్తనలలో భక్తితత్త్వాన్ని గూర్చి ఈ అధ్యాయంలో ప్రధానంగా చర్చించడం జరిగింది.

# హనుమద్దాసు కీర్తనలు-భక్తి

మన్నెంకొండ హనుమద్దాసు రాముని కీర్తిస్తూ 148 కీర్తనలు రచించాడు. హనుమద్దాసు కీర్తనల్లో భక్తిభావం అడుగడుగునా ద్యోతక మవుతుంది. ఈ కీర్తనల్లో కూడా అనేకరకాలైన భక్తిమార్గాలు అనుస రించబడ్డాయి. అందులో వాత్సల్యభక్తి, మధురభక్తి, దాస్యభక్తి, నిందాస్తుతులు ప్రధానంగా కనిపిస్తాయి.

# కీర్తనలు-వాత్సల్యం

భక్తుడు భగవంతుని పుత్రుడుగా భావించి, తాను ఆ స్వామికి తల్లిగానో, తండ్రిగానో ఊహించుకొని, పరమాత్మను లాలించి, బుజ్జగించే ప్రేమభావమే వాత్సల్యం. వాత్సల్యభక్తికి మూలం ఈ వాత్సల్యభావమే. వాత్సల్యభావానికి ప్రేరణ మమత. ఈ వాత్సల్యభక్తిలో భక్తునికి భగ వంతుని మీద భగవద్భావానికంటె, పుత్రభావమే అధికంగా ఉంటుందని చెప్పవచ్చు. దశరథుడు, యశోదవంటి వాళ్ళంతా ఈ వాత్సల్యభక్తితోనే

తమ జీవితాలను ధన్యంచేసుకొని మోక్షాన్ని పొందారు. హనుమద్దాసు కూడా ఒక్కొక్కదశలో ఆ రాముని తన పుత్రునిగా భావించి ఆ వాత్సల్య భావంలో తన్మయత్వాన్ని పొందాడు.

అనుక్షణం రాముని అంటిపెట్టుకొని ఉంటూ తమ వాత్సల్య భావాన్నంతా ఆ ప్రభువు ముంగిట వెదజల్లే దశరథుడు, కౌసల్య ల రూపంలోను మరోవైపు యశోద రూపంలో, హనుమద్దాసు ఈకీర్తనలో మనకు కనిపిస్తాడు.

ప. రామ రారా తారకనామ రారా। నీ
మోము జూచెద మేఘశ్యామ రారా॥

చ. 1 అయ్యరారా రఘురామయ్యరారా
నెయ్యిబువ్వ బెట్టెదానునయ్యేన రారా ||రామ||

2 అప్పరారా వొప్పుల కుప్పరారా
గొప్పముత్యాపు సరులతో నాకోదెరారా ||రామ||

3 అన్నరారా! రామన్నరారా
వెన్న మీగడబెట్టె దాను తిన్నగ రారా ||రామ||

4 తండ్రిరారా బంగరు కొండరారా
దండిగ శ్రీభద్రాశైలాధామ రారా ||రామ||

5 చిలుక రారా ముద్దులు గులుకవేరా
కలి హనుమద్దాసునితో పలుకవేరా ||రామ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–12)

'నా బంగారు కొండరారా' అంటూ తల్లి పిలిచే పిలుపే ఈ కీర్తనలో హనుమద్దాసు మనసులోని వాత్సల్యభావాన్ని బహిర్గతం చేస్తుంది. 'నా అయ్యరారా నీకు నెయ్యి బువ్వ పెడతాను' అంటూనే ఆ రాముని రూపాన్ని సైతం మనోహరంగా చెప్తున్నాడు. ఆ స్వామి

ఉప్పులకుప్పట, గొప్ప, గొప్ప ముత్యాల సరులతో రావాలట. 'వెన్నమీగడలు పెడతాను తిన్నగరారా' నాయనా అని పిలవటంలో, కొడుకును రహస్యంగా పిలిచి, తనివితీరా తను చేసినవన్నీ తినిపించే మధుర మాతృహృదయం ఈ కీర్తనలో మనోహరంగా వర్ణింపబడింది. భగవానుని సృష్టిలో అందమైనది రామచిలుక. ఆ చిలుక పలుకులు కూడా ముద్దులు మూటగడుతూ అందంగా ఉంటాయి. అందుకే ఆ ప్రభువును 'చిలుకరారా ముద్దులు గులుకవేరా' అని పిలుస్తున్నాడు. భగవంతుని పట్ల ఇంతటి అనురక్తితో కూడిన వాత్సల్యభావాన్ని ఈ కీర్తనలో హనుమద్దాసు మధురంగా పలికించాడు.

హనుమద్దాసు వాత్సల్య భక్తి భావప్రకటన చేసిన మరోకీర్తనలో

ప. "రామదయానిధె రామదయానిధే రామదయానిధె
రామదయాళో
నాముద్దులయ్య నీముద్దుమోమిటు, ప్రేమతోఁజూపర
రామదయాళో ||రామ||

చ. ననుగన్న తండ్రి నిను సేవింప నా
మనసయ్యున్నది రామదయాళో ||రామ||
నాయన్న నాతండ్రి నీయందు నాప్రేమ
బాయక యున్నది రామదయాళో ||రామ||
చక్కని నగుమోము అక్కర దీర నే
నెక్కడ సేవింతు రామదయాళో ||రామ||
బాలచంద్రోదయ లీలబోలు మో
మేలాగు సేవింతు రామదయాళో ||రామ||
అయ్యయ్యో నాముద్దులయ్య నీమోమిటు
నయ్యాన జూపర రామదయాళో ||రామ||

.......... .......... ..........
.......... .......... ..........

ఘనత మన్నెముకొండ ఘన మందిర నివాస
హనుమద్దాస వరద రామదయాళో ||రామ||
(హనుమద్దాసు కీర్తన-109)

'రామదయా-ళో' అంటూ ఆ స్వామి ముద్దుమోమును చూపమని అర్థించేభావం ఈ కీర్తనలో కనిపిస్తుంది. నన్ను కన్న తండ్రి నీ మీద నాప్రేమ తగ్గకుండా ఉందిరా, చక్కనైన నీ నవ్వు మొహాన్ని నా తనివి తీరా నేనెన్నడు 'సేవిస్తానో' అంటున్న వాగ్గేయకారునిలో వాత్సల్య పూరితమైన ఆర్ద్రత వ్యక్తమవుతుంది. బాలచంద్రుని పోలినవిధంగా ఉన్న ఆ ప్రభువు వదనారవిందాన్ని ఏవిధంగా చూస్తానో అనే జిజ్ఞాస కనబడుతుంది. 'అయ్యయ్యో నా ముద్దులయ్య' అంటూ చేసే సంబోధన మనోహరమైన వాత్సల్యభావాన్ని వ్యక్తపరుస్తుంది. 'చక్కనయ్యా ఒక్క సారి నీ సుందర వదనార విందాన్ని చూపరా' అంటూ ఆరాటపడే తల్లి ఆవేదన వాత్సల్య భక్తిగా ఈ కీర్తనలో ప్రకటించబడింది.

## కీర్తనలు-మధురభక్తి

భక్తుడు తనను ప్రేయసిగా, భగవంతుని ప్రియునిగా ఊహించుకొని ఆరాధించే భక్తి భావమే మధురభక్తి. "భక్తుడు భగవంతుని తన ప్రభువుగనో, పుత్రునిగనో, మిత్రునిగనో, ప్రియునిగనో భావించి భక్తి సాధన చేయును. వీనినే పంచభావములందురు. అవి 1 శాంతభావం, 2 దాస్యభావం, 3 సఖ్యభావం, 4 వాత్సల్యభావం 5 మధుర భావం". (శ్రీభగవదారాధన పేజి--83)

మధురభావమే మధురభక్తి, ఇది పంచభావాలలోకెల్లా గొప్పది. భగవంతుని పట్ల భక్తుడు ఏర్పరుచుకొనే మధురభావం సామాన్య మానవుల ప్రణయం వంటిదికాదు. ఇది దానికి భిన్నమై ఉంటుంది. భగవంతునిపైన అనురక్తిని పెంచుకొన్న భక్తుని చిత్తం ఉద్రిక్తమైనప్పుడు అతడు ఆ స్వామిని తన సొత్తుగా ఊహించుకుంటాడు

అతని మనసులో ఒక మనోహరమైన ప్రణయ భావనా వీచిక కదులుతుంది అప్పుడే ఆభక్తుడు, ఆ పరమాత్మకు ప్రేయసిగా మారిపోతాడు. తన సర్వస్వం ఆజగన్నాథుడే అని నిర్ణయించుకుంటాడు. భక్తునిలోని ఈభావమే మధురభక్తికి ఆలంబనమవుతుంది.

ఎందరో మహాభక్తులు మధురభక్తిని ఆశ్రయించి ముక్తిని పొందారు. భాగవతంలో రాధ, గోపికలు మధురభక్తి భావంతోనే శ్రీకృష్ణ పరమాత్మ సన్నిధిలో నిలిచి తన్మయత్వం పొందారు. వాగ్గేయకారులు కూడా మధురభక్తి పూరితమైన కీర్తనలు రచించి, గానంచేసి, ఆ పరమాత్మ ఆరాధనలో కాలం గడిపారు. మన్నెంకొండ హనుమద్దాసు కూడా మధురభక్తిని మేళవించి కీర్తనలు రచించి, తరించాడు.

తాను మనసారా ప్రేమించిన సుందరాకారుడైన శ్రీరామచంద్రుడు తన కగుపించకుండా పోతే ఆ స్వామిని తనకు కనిపించేలా చేయమని తన చెలికత్తెలను వేడుకొనే ప్రేయసి రూపంలో హనుమద్దాసు ఈ కీర్తనలో కనిపిస్తాడు.

ప. చూపరమ్మ మారాములా| బహుసుందరుడగు పరంధాములా
బాపురే వినరే నాప్రాణ పదంబైన| శ్రీపాతినెడబాసి చెలియ
తాళజాల ||చూప||

చ. కోటివేలిచ్చెద పోగదే| వో కొమ్మారో వానిందుదేగదే
బోటిరోమదనుడు పూలశరమ్ముల
మాటిమాటికి యదనాటించ సాగెను ||చూప||

కనులాక్షిరో వానిగానక నే
నిమిషమయ్యిన వోర్వగానికా
అమితవహోవిరహోము అతిభారమాయను
భ్రమ దీర్పగదరమ్మ ఖామలారానేదు ||చూప||

వినరమ్మ మనవి గైకొనరమ్మా। యీ
తనువు మీ సొమ్మను కొనరమ్మా
అనువుగ నన్నేలు ఆత్మేశు తోడుత
నినుబాసి ప్రాణము నిలువ లేదనరమ్మ ||మాప||

యేనాటి గూడెనొనేడుగా। నా
ప్రాణ నాథుడిటు రాడుగా
నానోము ఫలమేమొకాని యిటులరాడు
మానస మెటుల నెమ్మనగ ధరించే దొ ||మాప||

పొన్నలార యిందు లేదుగా। మీ
పొదల మాటున డాగరాదుగా
వెన్నుడైన శ్రీవెంకటరమణుడు
మన్నేము కొండలొవున్న జాడనేడు ||మాప||

హనుమద్దాసుని సహాయనో। లేక
అజాని నిర్మాణమే మాయనో
చనువు శాయక వేగమున నా ప్రాణేశుని
కనుల పండువు గాగ ఘన సంతోషమునాము'' ||మాపరమ్మ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–87)

మధురభక్తి ఈ కీర్తనలో మనోహరంగా వర్ణించబడింది. ఆ రాముని విడిచి తాను నిలువలేనని, నా ప్రాణప్రియమైన శ్రీపతిని వదలి 'ఓ చెలియా నేను తాళలేక' పోతున్నానని హనుమద్దాసు తన ఆవేదన తెలియచేశాడు. మన్మథుడు మాటి మాటికి తన మదన బాణాలను ఎదలోనాటి విరహాన్ని పెంచుతున్నాడు, నా స్వామిని విడిచి ఒక్క నిమిష మైన నేనుండలేను అంటూ తన చెలియలను ఆ స్వామి వద్దకు రాయ బారం పంపుతున్న ప్రేయసి ఈ కీర్తనలో కనిపిస్తుంది. నిన్ను వదలి ప్రాణం నిలువలేదని తన ఆత్మేశునితో చెప్పమని ఆ స్వామి వద్దకు సందేశం పంపుతున్న ప్రియురాలు 'నానోము ఫలమేమొ గాని' నా

ప్రియుడు ఇంకారాలేదేమిటి?' ఇంకే స్త్రీతో కలిసినాడో ఇంకా రాకున్నాడు అని విచారపడుతుంది. అంతే కాకుండా, తన చెలికత్తెలతో మీ పొదల మాటునన్నైతే లేడుకదా? అని, అనుమానాన్ని వ్యక్తపరచడాన్ని చూస్తుంటే "మల్లియలార మీ పొదల మాటున లేడుగదమ్మ చెప్పరే?" 1 అనే గోపిక గుర్తుకు వస్తుంది. హనుమద్దాసు ఈ కీర్తనలో మధురభక్తిని మృదుమధురంగా పలికించాడు.

జగన్మోహనుడైన ఆ శ్రీరామ చంద్రుని వదనార విందాన్ని చూసి తరించాలనే కోరిక మనసులో నిండిపోవడంతో మధురభక్తిని ఆశ్రయించి ఆ ప్రభువు సుందర వదనాన్ని చూపమని, ఆ ప్రభువునే వేడుకుంటున్న ప్రేయసి రూపంలో హనుమద్దాసు ఈ క్రింది కీర్తనలో కనిపిస్తాడు.

"రామదయానిధె రామదయానిధె రామదయానిధె రామదయశౌ
నా ముద్దులయ్య నీ ముద్దుమోమిటు
ప్రేమతో జూపర రామదయాశౌ ||రామ||

నిముషము యుగమాయె నినుబాసినే నర
నిముషమోర్వగ లేను రామదయాశౌ ||రామ||

మనసు నిబ్బరమాయె మదికి యుగ్గలమాయె
తమువు ఛరించాదు రామదయాశౌ ||రామ||

యేమిసేయుదు నింక నేలాగు తాళుదు
నీ మోము జూపర రామదయాశౌ ||రామ||

బంగారు కొండ నీ శృంగారముగుమోము
సంగాతి సేవింతు రామదయాశౌ ||రామ||

......... ......... .........
......... ......... .........

---

1 శ్రీమదాంధ్రభాగవతము, స్కం॰ 10; అధ్యా॰ 30; పద్యం॰ 1010

ఘనత మన్నెము కొండ ఘనమందిర నివాస
హనుమద్దాస వరద రామదయాళో ||రామ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-109)

ఆ రాముని వదనార విందం, ఆ భక్తునికి జగన్మోహనంగా కనిపిస్తున్నదట. ఆ సుందర వదనాన్ని శ్రద్ధగా సేవిస్తాడట. 'ఓ రామ నేనింకా యేమి చెయ్యనయ్యా'? నీ ముఖాన్ని చూడకుండా ఉండలేక పోతున్నాను, నా తనువులోని అణువణువు నీ రాకకోసం ఎదురుచూస్తుంది, నా మనసంతా కూడా నీమీదే లగ్నం చేసి ఉన్నాను. 'స్వామీ నీకైతే ఎలా ఉందోకాని, నాకు మాత్రం తత్తరపాటుతో, నిలవడానికికూడా శక్తిలేదు. పరిపరి విధాల నా మనసు నీమీదే లగ్నమైంది మరిచి పోదా మన్నా నా హృదయం నిన్ను మరువలేకపోతుంది. అంటూ హనుమద్దాసు అనేక విధాలుగా ఆ రాముని వేడుకున్నాడు. 'నా కన్నుల పండువుగా నీరూపాన్ని చూసేదెన్నడో' అంటూ తన మధురభక్తిని మధురంగా ఆ రాముని ముందు ప్రకటించుకున్నాడు.

## కీర్తనలు-దాస్యభక్తి

భగవంతుని తన యజమానిగా భావించుకుంటూ భక్తుడు తాను ఆ స్వామికి సేవకుడుగా ఉండాలని కోరుకుంటాడు. ఇది దాస్యభక్తి లక్షణం. కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, ఆత్మనివేదనాలలో సైతం భక్తుడు భగవంతుని పట్ల ఈ సేవ్య సేవక భావాన్నే ప్రదర్శించడ మనేది ఈ భక్తి మార్గాలన్నిటిని దాస్యభక్తిలో అంతర్భవించేటట్లు చేసింది. హనుమద్దాసు కీర్తనల్లో ఈ దాస్యభక్తి బాగా కనిపిస్తుంది.

ప. సీతా సమేత రారా| శ్రీసీతా సమేత రారా
సీతా సమేత పాతాక హరనాదు
దాతావనుచు నిన్నుదలచి భజించెద రారా ||సీతా||

చ. ముద్దూ ముద్దులు గుల్కూ మోమిటు జూపిర
వద్దూ చేటికి నావద్దికి వేవేగ రారా ||సీతా||

మేలూ మేలురసి లీలావినోదము
చాలాదలచి మది నోలాలాడుదు యిందు రారా ||సీతా||

వింటే వింటి నీవంటిదైవము లే
దంటినె నీ బంటు నయ్యేద యిందు రారా ||సీతా||

యేది యేదిర నీ పాదాబ్జములు నే
మోదము తోడుత మ్రొక్కి శేవింతు యిందు రారా ||సీతా||

వాసౌకమత హనుమద్దాస పోషణ శ్రీని
వాసా భద్రాద్రినివాసా కోదండపాణి రారా ||సీతా||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–10)

ఈ కీర్తనలలో దాస్యభక్తి రూపమైన పాదసేవనం ద్యోతకమవు తుంది. 'నీ పాదాబ్జమునే మోదాము తోడుత మ్రొక్కి శేవింతు' అంటూ ఆ రాముని పట్ల తనకున్న సేవా భావాన్ని ప్రకటించుకోవడం కనిపిస్తుంది.

ప, యేదారి జూపవు రామా! యే
దేదిర నామీద ప్రేమా॥ ||యేదారి|

నాదు మొరయాలించ కున్నను
నీదు పదములు విడువ నమ్మి
కాదులేదని దబ్బరము
కదల వన్నా కదల నివ్వను ||యేదారి||

చ. కరుణాతో పోషించరాదా యింత
కఠినాము యెందైన గలదా
పరుల వేడను నమ్మి నేనిక గురుతుగా దరిజేర్చుకున్నను
జరుగ నివ్వను నేను మీ మృదు చరణములు యరికట్టుకుండెద
||యేదారి||

భక్తాభిమానము లేదా! నేనీ
పాదాశేవకుడాను గాదా
భుక్తిముక్తి యొసంగ వేడితె యుక్తిదెల్పికటాక్షమ్ముంచక
రక్తిలేదన శక్తిలేదన రాదుగా! యిది! పాడుగా ||యేదారి||

విని విననటులుండ మామా
నిన్ను విడచి పెట్టేవాడ గానూ
దనరగా నతిప్రేమ మీతలిదండ్రులొచ్చిన గాని నిను నే
దాటి పోవగనివ్వ నీవిక దైవమని నఘ నెరువ సుమ్మీ ||యేదారి||

శ్రీ సద్ద్రుదాచల వాసా! నన్ను
చేపట్టుమిక చిద్విలాసా వాశిగా నిను వదల విడిచితె
వసుధ లోపల నేడు హనుమద్దాసుడను
నామాంకితంబిక తీసి పిలువుము మారుపేరున ||యేదారి||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–11)

ఈ కీర్తనలో భక్తుని ఆర్తి ద్యోతకమవుతుంది.

"చతుర్విధా భజంతే మాం, జనాస్సుకృతినో ర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ, జ్ఞానీచ భరతర్షభ" [1]

అని భగవద్గీతలో చెప్పినట్లు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని భక్తులు నాలుగు విధాలుగా ఉంటారు. ఈ కీర్తనలో హనుమద్దాసు తన మొరవినమని కోరడంవల్ల ఆర్తుని ఆత్రత వ్యక్తమవుతుంది. "భక్తాభిమానము లేదా నేనీ పాదశేవకుడను కాదా!" అని అంటున్న హనుమద్దాసులో, ఆ దాసుని మృదు చరణారవిందాలను సేవిస్తానని, ఆ స్వామి స్మరణంలోనే తన జీవితాన్ని వెలిగించుకుంటానని ఆతుతపడుతున్న దాసుడు కనిపిస్తాడు.

---

1 భగవద్గీత. అధ్యా: 7 ; శ్లో: 16

హనుమద్దాసు పూర్తిగా రాముని నమ్ముకున్నవానిగా అతని కీర్తనలలో వ్యక్తమవుతుంది.

ప. రాముల నమ్మిన వారమూ। మేమూ
రామ రామయను వారమూ
హరిభక్తి గురిశేయు వారమూ। భక్త
పరుల సంగతి నొందు వారము। ముక్తి
తెరువు గాంచెటి వారమూ। మేమూ
మరువాము హరినామ సారమూ శ్రీ ||రాముల||

చ. నిద్రాక్షుద్బాధల గూడమూ। రామ
భద్రుని నామము వీడమూ। తెలిసి
క్షుద్ర మానవులానువేడమూ। ఆత్మ
భద్రావనా గురి విడనాడమూ శ్రీ ||రాముల||

దాస్య దాస్యము నొందువారమూ। భగవ
ద్దాస్య సంబంధము వారమూ। అప
హాస్యము మొదటికే న్యారమా। మేము
దేసి కేంద్రుల జేరువారమూ శ్రీ ||రాముల||

పంచభూత ప్రభవసౌఖ్యమూ। ప్రా
పంచవాసన లోన జిక్కమూ। మేము
కొంచపు నరులాకు మ్రొక్కమూ। దివ్య
పంచ సంస్కారులము నిక్కమూ శ్రీ ||రాముల||

కేవల వైష్ణవ వారమూ। మదిలో
శ్రీవిష్ణునామమే సారమూ। భక్తి
భావించి నుతి శేయువారమూ। యితర
భావంబులకు మేము దూరమూ శ్రీ ||రాముల||

భాసుర భద్రాద్రి వారమూ। మోక్ష
పదవి మార్గము జెంద గోరెము శ్రీ
భూసుత సహితుని వారమూ। హనుమ
ద్దాస హృద్దాసుని వారమూ। శ్రీ ||రాముల||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–13)

తాను పూర్తిగా రామునే నమ్మానని, క్షుద్రమానవులను యాచించనని, సదా శ్రీరామునికే దాసుణ్ణి అని వచించాడు. హనుమద్దాసు జీవితం త్యాగరాజు, రామదాసుల జీవితాలకు దగ్గరగా కనిపిస్తుంది.

ప. "రాముడే దైవాము తెలియు సుమీ। పరం
ధాముని సన్నిధి గలయు సుమీ॥

చ. హరినామ కీర్తన మరువాకుమీ। దూ
స్తరమైన మార్గము నడువాకుమీ। దుష్ట
నరుల సంగతి నోటనుడు వాకుమీ। యితర
పరవార్తలకు నెల్లపరువెత్త బోక శ్రీ ||రాముడే||

సాధు సజ్జనసేవ సల్పు సుమీ। సుసు
బోధానంద హరించు సుమీ। మది
క్రోధ వికారము ద్రుంచుసుమీ। హరి
శ్రీ ధరగోవింద సీతారామ శ్రీ ||రాముడే||

నిందు బూర్ణ భావామొందు సుమీ। మంచి
పందు మోక్షార్థము జెందుసుమీ। వే
దండ పాణిని మది గొలువు సుమీ। వే
దండ వరదయని వినుతి సేయుచు శ్రీ ||రాముడే||

మనసు సంకల్పము బాయు సుమీ। యను
దినము భద్రాద్రీశు గనుము సుమీ। దూ

తనువు దైవా దీనంసేయు సుమీ। శ్రీ
హనుమద్దాసుని పాలిఘనవరంధాముడా ||రాముడే||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–22)

హనుమద్దాసు భద్రాద్రి రాముని దర్శించి రాజశిఖామణి దొరికె నని ఆయన్ని చూసే మహాభాగ్యం లభించిందని, భక్త్యావేశంతో ఆయన్ను కీర్తించాడు.

సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడైన రాముని ఏ విధంగా పూజించాలో తెలియక తత్తరపడే భక్తుని యొక్క బేల హృదయం హనుమద్దాసుని ఈ కీర్తనలో చిత్రితమైంది.

ప. ఎక్కడ పూజింతు నేనూ। చక్కని శ్రీరాములాను
అక్కడ యిక్కాడ యెక్కడ జూచిన। నిక
నిక్కము యాత్మలో నిలిచి వెలుగు చున్నాడు ||ఎక్కడ||

చ దేవుడనుచుమది భావించి మరియుంచి
ఆ వాహనము సేయ భూావలయము నిండే ||ఎక్కడ||

ఆ ద్యంతునకు నర్ఘ్యపాద్య మివ్వగ బోతే
అబ్ధిలోనదేలి యాడు చున్నవాడు ||ఎక్కడ||

యిభరాజ వరదున కభిషేక మొనరింప
త్రిభువన జలములో ప్రభవించి యున్నాడు ||ఎక్కడ||

అచమాన వస్త్రిమర్పింపగా బోతే
సూచనగాస చరాచరుడైనాడు ||ఎక్కడ||

యజ్ఞోప వీతము ప్రజ్ఞాతొనివ బోతె
యజ్ఞాధికారి సర్వజ్ఞుడై యున్నాడు ||ఎక్కడ||

సకల మణుల దివ్య మకుట మివ్వ బోతె
అకళంక మూర్తి చిదానందుడైనాడు ||ఎక్కడ||

అందమైన మంచి చందానమిన బోతె
యిందిరేశుడు మనకంద రాకున్నాడు ||ఎక్కడ||

మల్లెపూవుల తులసి మాలికలివ బోతె
అల్లారు మోము పద్మాకరుడైనాడు ||ఎక్కడ||

అగరు పరిమెళ సాంబ్రాణి ధూపము లివ్వ
త్రిగుణాత్మకుడు వాయువుడై యున్నాడు ||ఎక్కడ||

పాప హరునకు దివ్య దీపారాధన సేయ
అపొజ్యోతి విశ్వరూపుడై యున్నాడు ||ఎక్కడ||

........ ........ ........

........ ........ ........

చామరమున వుపచార మివ్వగ బోతె
స్వామి భద్రాచల ధాముడై యున్నాడు ||ఎక్కడ||

దాసత్వ మొనరించి దవిలివేడితె హనుమ
ద్దాసుని హృదయ నివాసుడై యున్నాడు ||ఎక్కడ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–23)

ఎక్కడ చూసినా రాముడే కనిపిస్తున్నాడు. మనస్సునిండా నిండి రాముడే కనిపిస్తున్నాడు. దేవుని ఆవాహనం చేయబోతె భూమండలం అంతా నిండి పోతున్నాడట. అర్ఘ్యపాద్యాలు ఇద్దామనుకుంటే అబ్ధిలో తేలియాడుతున్నాడట. అభిషేకం చేద్దామనుకుంటే సమస్త జలాల్లోను కనిపిస్తున్నాడు. రాముని సర్వవ్యాపకత్వాన్ని గూర్చి హనుమద్దాసు కీర్తనలో సువ్యక్తమౌతున్నది. అంతే కాదు, అర్చనం–దాస్యంలో అంతర్భవించిన తీరు ఈ కీర్తనలో సుస్పష్టం చేయబడింది.

ప. "కోదండ రామయ్య రాగదె గొబ్బున నన్నేలు కోగదె

చ. సారె సారెకు వేడుకొంటి నీ

సరిలేరు యిక దైవ మంటి నీ

ధారుణిలో కీర్తి వింటినీ| త
ద్దాసుని దరిజేర్పు మంటినీ ||కోదండ||

దిన దినమొక యుగమాయనె
తీరాని వ్యధ ఘనమాయనె|
మనసెంతొ నిబ్బారమాయనె నీ
మదికింత కరుణ రాదాయనె ||కోదండ||

శరణాని నతి సేయువాడా నేని
చరణాబ్జములు విడనాడనె
పరుల నింకెవరిని వేడనె నీ|
పాదములె నమ్మి నాడనె ||కోదండ||

కనికరమున నన్ను బ్రోవవె నీ
కరుణ దాచక యిటు రాగదె
చనువేల మనవి గైకోగదె యీ
తనువు నీ సొమ్మను కోగదె ||కోదండ||

తల్లి దండ్రివను కొంటినీ
దరిజేర్చి నన్నేలు మంటినీ
యెల్లలోక ప్రభువంటినీ
నన్నేలు కొమ్మని శరణంటినీ ||కోదండ||

ఘనభద్రగిరి రాముడంటినీ నా
కనుల పండుగ జూడగంటినీ
హనుమద్దాస వరదు డంటినీ నా
కనుకూల మగుదైవ మంటినీ ||కోదండ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—26)

రామునికి సమానమైన దైవం వేరొక్కరు లేని కాబట్టి తాను పరులను వేడుకోనని, తాను రాముని దాసుడనని హనుమద్దాసు ఈ కీర్తనలో వ్యక్తపరిచాడు. రాముని కరుణా కటాక్షవీక్షణాలు తనమీద ప్రసరించక పోవడం వల్ల తనకొక్కగడియ ఒక యుగంల గడుస్తున్నదని మనసులో తీరని వ్యథ బయలు దేరిందని, ఆయన కరుణ కలుగలేదని, ఆయన్నే విడువక శరణు గోరుచున్నానని ఆయన పాద పంకజాలనే మనసార నమ్మానని వేడుకుంటున్నాడు. రామునికి శరణాగత రక్షకుడనే బిరుదు ఉంది. కాబట్టి ఆయన్నే, తల్లివి, తండ్రివి అని పిలుస్తూ, గొంతులో ఆర్తిని పలికిస్తూ హనుమద్దాసు, ఈ కీర్తనలో పాదసేవనాన్ని, ఆత్మనివేదనాన్ని కలబోసుకున్న దాస్యభక్తిని వ్యక్తంచేశాడు.

ఈ కీర్తనలో భగవంతుని దశావతార వైభవం అపురూపంగా కీర్తించబడింది.

ప, "కోదండపాణి నమో నమో| హరి|
కోదండపాణి||

చ మీనక మఠకిటి నరా మృగరూప
శ్రీ నారాయణ నమో నమో హరి ||కోదండపాణి||
వామన జయ భృగురామ శ్రీరఘువరా
కామితార్థ బలరామ నమో హరి ||కోదండపాణి||
విలసిత బౌద్ధఃక్కలికి శ్రీదశవిధ
లలితావతార నమో నమో హరి ||కోదండపాణి||
ఘనమన్నెము గిరీ కారణ నిలయా
హనుమద్దాస వచనాన్వయ పాలన ||కోదండపాణి||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–31)

మీనావతారం నుంచి కల్కి అవతారం వరకు మొత్తం స్వామి దశావతారాలు ఈ కీర్తనలో స్మరించబడ్డాయి.

భగవంతుని నామాన్ని, ఆస్వామి గుణలీలాదులను ఉచ్చైస్స్వరంతో కీర్తించడమే కీర్తన భక్తి. ఈ కీర్తనలో హనుమద్దాసు ఆ హరిని స్మరిస్తూ, నమస్కరిస్తూ, కీర్తిస్తున్నాడు.

దురాత్ముడైన జీవుడు పశ్చాత్తప హృదయంతో దేవుని ప్రార్థించే విషయం ఈ క్రింది కీర్తనలో వ్యక్తపరచబడింది.

ప. మహాప్రభో మహాప్రభో నే మహాపరాధిని మహాప్రభో

చ. దురాత్ముడను బహు పురాకృతముచే
తరించనైతిని మహాప్రభో ||మహా||

పరద్రవ్యముల భ్రమించి మిమ్ముల
స్మరించనైతిని మహాప్రభో ||మహా||

మాయాంధకారము కాయమెని జమని
సేయానైతిని సేవ మహాప్రభో ||మహా||

సాహసముననే మోహము జెందక
సోహము గాంచితి మహాప్రభో ||మహా||

యేరీతినైన నన్నేలి పోషించుట
భారము మీదట మహాప్రభో ||మహా||

పాపాత్ముడను మీ పాపుజేరినాను
ప్రాపు దాపు నీవె మహాప్రభో ||మహా||

మీ దాసుడను నాకేదారి జూపెదొ
వేదాంత వేద్యుడ మహాప్రభో ||మహా||

పాతకుడను బహుఘాతకుడను న
న్నే తీరుగ బ్రోచెదొ మహాప్రభో ||మహా||

కఠినా చిత్తుడను దుష్కర్మిని ద్రోహిని
యెటులా భరించెదొ మహాప్రభో ||మహా||

దయజూడు మంటిని దైవామటంటిని
భయమేల నంటిని మహాప్రభో ||మహా||
దుష్టాగ్ర గణ్యుడ దుద్మానుడను పర
నిష్ఠా! లేనివాడ మహాప్రభో ||మహా||
యించా తరముగాని పంచ మహాపాతకుడ
వంచన శాయకు మహాప్రభో ||మహా||
శాయరాని తప్పు జేసితి ననుదయ
శాయావె నా తండ్రి మహాప్రభో ||మహా||

........ ........ ........

........ ........ ........

హనుమద్దాస వరద యార్తారక్షామణి
నను దయనేలవె మహాప్రభో ||మహా||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–33)

తాను అనేక జన్మల నుండి పాపాలు చేశానని, పరుల ద్రవ్యాన్ని ఆశించావని, మాయాంధకారంలో మునిగి శరీరమే శాశ్వతమనుకున్నానని మోహంలో మునిగి 'సోహన్ని' కాంక్షించినానని భగవంతుని గూర్చి మొర పెట్టుకొన్నాడు. పాపాత్ముని, నీ సాన్నిధ్యంలో చేరాని పంచమహాపాతకుడినని, తనను వంచన చేయవద్దని, నీ సేవకునిగా మారిపోయానని, నీ దాసుణ్ణి నాకేదైనా దారి చూపించమని హనుమద్దాసు ఈ కీర్తనలో ఆ స్వామికి సర్వాత్మ సమర్పణ చేస్తూనే తన దాస్యభక్తిని కూడా ప్రదర్శించాడు.

రాముని తండ్రిగా భావించి దయను అర్థించి ఆ స్వామికి దాసుడై పాదసేవనం ద్వారా ముక్తిని పొందగోరే హనుమద్దాసు మనోవాంఛ ఈ క్రింది కీర్తనలో దర్శనమిస్తుంది.

ప. రామా విడువను నిన్నూ! హో!
రమయా విడువను నిన్నూ!!

చ. పామరుడను బహు పాపకర్ముడను
తామసమున నను దన్నిన దన్నును ||రామా||

కుడిపాదము వకచేతా| మీ
యడమపాదమొక చేతా|
విడువక బట్టుక వినుతి జేసెదను
తడయక నను నీ దయతో నేలుము ||రామా||

పట్టుబట్టెదను చూడూ| నిను
వదల పోనివ్వను నేడూ
పట్టి విడువ మీ పాదము లానా
అట్టె కోపమున కొట్టిన గొట్టుము ||రామా||

నీ మహ మహిమలు వింటే
నిన్నే నమ్మికొని యుంటే
శ్రీమహాలక్ష్మిని చెంగటనుంచక
వో మహరాజా నా వశమైతివిగా ||రామా||

శరణాగత బిరుదేది| నీ
దొరతన మన ఘనమేదీ
సిరిజూచుక మహామురిపెముతో నను
మరచినందుకు నేడు దొరికితి విడుగో ||రామా||

మన్నెము కొండలో వున్నా| ఘన
మహ ప్రభువని విన్నా
ధన్యత హనుమద్దాస వరద నా
కన్న తండ్రివై గనుపడితివి గా ||రామా||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—50)

రాముని ఎప్పుడూ విడువనని, నిన్నే నమ్ముకొని ఉన్నానని శరణా గత రక్షక బిరుదుమ సార్థకం చేసుకోమని ఆ స్వామిని కోరుకోవడం కనిపిస్తుంది. కుడి పాదం ఒక చేతో ఎడమ పాదం ఒక చేతో పట్టుకొని, ఆ స్వామికి కోపంవచ్చి తనను తన్నినా సరే ఆ స్వామి పాదాలను విడువ నని మొరపెట్టుకొనే ఈ కీర్తనలో, స్వామి పాదాలను నమ్ముకొని సేవించే భక్తుడు దర్శనమిస్తాడు.

ఈ విధంగా కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, ఆత్మ నివేదనం మొదలైన భక్తిమార్గాలను తనలో నిబిడీకృతం చేసుకున్న దాస్యభక్తికి ఉదాహరణగా హనుమద్దాసు కీర్తనలను మరెన్నో చూపవచ్చును.

1 ప. "నోరామా! రాఘవ దాశరథీ! నోరామా
నీరాజ దళనేత్ర కారుణ్య మయగాత్రీ" ||నోరామా.||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-40)

2 ప. యాది వుంచు నామీద నోరామ! నీపాదసేవకుడానురా! నోరామా
ఆదిపురుష నీకే దయరావలె! అఖిల పావన దేవా! నోరామా
||యాదివుంచు||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-55)

3 రాముల జూచేదెన్నడో! పరంధాముల జూచేదెన్నడో
కామాది విషయ దుర్గతుల వధించుక! పామార మణచి
దుర్భారము నొంచక ||రాముల||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-122)

# కీర్తనలు-నిందాస్తుతి

భగవంతుని మీద భక్తిని పెంచుకున్న భక్తుడు ఆ భక్తిలోనే లీనమై పోతాడు. పరమాత్మను సర్వాంతర్యామిగా భావిస్తాడు. ఆ భావనలోనే తనకొచ్చే కష్టనష్టాలను ఆ స్వామికి విన్నవించుకుంటాడు. అతన్ని శరణువేడ్తాడు. తనను రక్షించమని ప్రార్థిస్తాడు, తన మొర ఆలకించక పోతే ఆ భగవంతునే నిందిస్తాడు ఆ నిందలో సైతం ఆ స్వామి స్తుతి అంతర్గతంగా శోభిస్తూనే ఉంటుంది అలాంటి నిందనే నిందాస్తుతి అని చెప్పుకుంటాం.

హనుమద్దాసు కూడా జీవితంలో తనకు కష్టనష్టాలు వచ్చినప్పుడు భగవంతుని నిందాస్తుతి గావించాడు నిందాస్తుతికి సంబంధించిన కీర్తనలు అతని సంకీర్తన రచనలో కనిపిస్తాయి.

ప. దశరథ నందనా దయరాదేమీ
దశరథ బాల నిర్దయ సేయమేలా ||దశరథ||

చ. వేమారు నమ్మి! నేడీతి సుమ్మి
నీమది కింతైన ప్రేమరాదేమి ||దశరథ||

ఆకొనియున్నా ఆదుకొమ్మన్నా
నీకే కరణు రాక యున్నాదో ||దశరథ||

దేవా దేవా! బ్రోవరావా
రావాదేమి కావావదేమీ ||దశరథ||

మన్నేము శైలా! మందిర ఖేలా
అన్యమికేలా ఆదుకోవేలా ||దశరథ||

భాసవిలాసా! ధన్యనివాసా
భాసుర హనుమద్దాసనుపోష ||దశరథ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-68)

నిన్ను నమ్ముకొని యున్న నామీద నీకు దయరాదేమయ్యా, నిన్నే అంటిపెట్టుకొని ఉన్నవాడని నామీద కరుణ చూపించలేక పోతున్నావేమిటి? అంటూ తనను కరుణించమని ఆ రామచంద్రుని మీద ఈ కీర్తనలో కాస్త ఆగ్రహాన్నే వ్యక్తం చేసాడీ భక్తుడు.

తాను ఎంతో నమ్ముకొనియున్న రాముడు తనను మోసం చేస్తున్నాడనే బాధను హనుమద్దాసు ఆ రాముని ముందే వెళ్ళబుచ్చుకున్నాడు.

ప. యెంతో నమ్మికు యుంటి యేమయ్య
శ్రీరామా! నాకేమి జెప్పావుగా మహాప్రభో
యింత మోసమాట యిదియేమి చోద్యామో
యిఫు యెవ్వరిని దూరుదూ మహాప్రభో ||యంతో||

చ. తల్లిదండ్రివని తరుచుగ నమ్మితె
తగునయ్య యిటు సేతురా మహాప్రభో
తల్లీదండ్రిలేని తనయుని విధమాయె
తరచుగ బ్రోవరాదా మహాప్రభో ||యంతో||

అతిభారమాయ సదానందమున
దెల్పవదియేమి రఘునందనా మహాప్రభో
హితవుడవని నన్ను బతిమాలు చున్న నా
గతి యేమి తెల్పవుగా మహాప్రభో ||యంత||

మునుపటి నెనరు నేడను కూలించదు నీ
మనసు యట్లున్నాదొకా మహాప్రభో
అనుకూలించితె నీయబ్బసుల్లెమైన
ఘనముగ వ్రయమౌనొకా మహాప్రభో ||యంతో||

దండి దాతువు నీదాపున జేరితె
తెండో చింత సేతురా మహాప్రభో

పుండరీకాక్ష సంపూర్ణ కటాక్షము
బూనినన్ను బ్రోవవె మహాప్రభో ||యంతో||

సీతాపతి యాశ్రిత జనరక్షణ
నాతోటి తగవెందుకూ మహాప్రభో
యే తీరునైన నన్నేలుకొమ్మని రెండు
చేతులెత్తి మ్రొక్కెదా మహాప్రభో ||యంతో||

ఘనత మన్నెము కొండ ఘనుడవనుచు నిన్ను
గమగొని మతియించెదా మహాప్రభో
హనుమద్దాసు కోర్కె లొసగూర్చు మనుచు నా
మనసులో ధ్యానించెదా మహాప్రభో ||యంతో||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన--111)

శ్రీరామచంద్ర ప్రభువునే హితుడుగా నమ్మితే తన గతి యేమిటో కూడా తెలపడం లేదట. తల్లితండ్రిలేని తాను ఆ రామునే తల్లిదండ్రిగా భావించినప్పటికి, తనబ్రతుకు తల్లిదండ్రులు లేని అనాథ బ్రతుకై పోయిందట. ఆయన్నే నమ్మిన తనను 'ఇంతమోసం చేస్తున్నావు ఇదేం చోద్యమయ్యా రామా' అంటూ హనుమద్దాసు, రాముడు తన పట్ల ప్రదర్శించే నిర్దయను విరసిస్తున్నాడు. మునుపటిలాగా తనమీద ఆ ప్రభువు యొక్క కరుణా కటాక్ష వీక్షణాలు ప్రసరించడం లేదట. 'గొప్ప దాతవని', ఆ రాముని స్తుతిస్తూనే, నన్ను కరుణిస్తే 'నీయబ్బ సొమ్మేమైనా' పోతుందా అంటూ ఆ స్వామిని నిందిస్తున్నాడు. 'ఓ సీతాపతి!' ఆశ్రిత జనరక్షకా నాతోటి నీకు తగవెందుకయ్యా నన్ను రక్షించవయ్యా అంటూ చివరకు ఆ రామచంద్రునితో రాజీకి దిగిన వైనం ఈ కీర్తనలో కనిపిస్తుంది.

ప. యేమి దోచాదాయా రామయ్య నా। కేమి దోచదయా
యేమి దోచదాయునింక యేమి సేతువయ్య తండ్రి
పామర మానవుడు గనుక బాధలాకు వోర్వలేను ||యేమి||

వెరపు దీర్చుటకు నా దొరవాని వేడితె
తెరవున దొంగాలు తరిమీన విధమాయె ||యేమి||
తల్లిదండ్రి గురుదైవామీవని యంటె
ముల్లుపై అరిటాకు మోపిన విధమాయె ||యేమి||
మంచివాడవని నీపంచనా జేరితి గాని
పొంచి నిండు బావిలోన ముంచిన విధమాయనయ్యా ||యేమి||
ఘనముగ మిమ్ము నామనమున దలచితె
గొనకొన్నమాయలో నముంచ న్యాయను ||యేమి||
నాయిష్టదైవమని నమ్మి యుండితిగాని
మాయవాదివౌట మదిదెలియ దాయను ||యేమి||
యండమావుల జూచి యేగుపశులరీతి
దండి మన్నెముకొండ ధామా నీకొలువాయె ||యేమి||
హనుమద్దాసుని పాలి యధిపతి వనియంటె
కమపకరాద శ్రీకమలా మనోహర ||యేమి||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-120)

తనను తాను పామరమానవుడుగా చెప్పుకుంటునే తనను రక్షించలేని ఆస్వామి అశక్తత వల్ల తనకు కలిగిన కష్టనష్టాలను హనుమద్దాసు ఈ కీర్తనలో యేకరువు పెడుతున్నాడు.

తనదొరగా ఆరాముని నమ్మి తనకు కలిగిన భయాన్ని తీర్చు కొందామను కుంటే తన బతుకు దొంగలు వెంటబడి తరిమినట్లుగా అయిపోయిందట మానవునికి మొదటి దైవము తల్లి, తరువాత తండ్రి ఆతరువాత గురువు పిదప భగవంతుడు, ఇక్కడ హనుమద్దాసు తల్లి తండ్రి గురువు దైవం అన్నీ ఆరాముడే అని నిర్ధారించుకొంటే తనజీవితం ముల్లు మీద అరిటాకు మోపిన విధంగా తయారయిందని ఆ రాముని నిందిస్తున్నాడు. తనను రక్షించమని ఆ రాముని పంచన జేరితే నిండు బావిలో ముంచిన విధంగా అయిందట. ఈ విధంగా తనకొచ్చిన కష్టాలన్నీ ఆ స్వామి

వల్లనే సంప్రాప్తించాయని ఆ రామునే పైకి నిందిస్తూ—అంతస్స్రాత్రంగా స్తుతించిన వైనం కనిపిస్తుంది.

తనను రక్షించమని వేడుకున్న హనుమద్దాసు ఆ రాముడు తనను పలకరించక పోవడంతో ఆ స్వామిని

ప. రామ నీకిది ధర్మమా। పలుక। రాదో నాకర్మమా।।
పామరుడను నేను నాపాపమో నీకోపమో ।।రామా।।

చ. మొరబెట్టిన వినవు నీమది కృూరమో నిష్ఠురమో
నాతప్పులు ఘనమొకా యిదిన్యాయమా అన్యాయమా ।।రామా।।
చూచి చూడకున్నవు యిది చోద్యమో అభేద్యమో
కాచిబ్రోవగ నీకు చాతగాకనో కృపలేకనో ।।రామా।।
పన్నుగా శ్రీమన్నెము కొండలో వున్నవో లేకున్నవో
తిన్నగ హనుమద్దాసు మనవి విన్నవో వినకున్నవో ।।రామా।।
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–128)

అనిరక్షించమని యెలుగెత్తి వేడుకుంటున్నా, నా మొరవినవు, నీ మనస్సు కృూరమయిందా? అంటూ ఈ కీర్తనలో ఆ రాముని నిందల పరం చేస్తున్నాడు. చూచి చూడకుండా ఉన్నావు ఇదేం చోద్యమయ్యా?' అంటూ నన్ను రక్షించడం నీచేత గానట్టుంది అని ఆ స్వామిని అశక్తుడ వని నిందిస్తున్నాడు. ఎంతకూ తనమొర ఆలకించక పోవడంతో అసలు మన్నెంకొండలో ఉన్నావా లేవా? ఈహనుమద్దాసుని మనవి విన్నావా లేదా? ఈ హనుమద్దాసుని మనవి విన్నావా లేదా అనే అనుమానాన్ని వ్యక్తం చేశాడు. ముందు రాముని నిందించినా చివరకు ఆ స్వామి తప్పు ఏమీ లేకుండా చెయ్యాలని కాబోలు; 'అసలు భగవంతుడు మన్నెంకొండలో లేనట్టుగా ఉంది. నా మొర విననట్టుగా ఉంది అనుకుంటూ' ఆ రామ చంద్రుని వెనకేసుకరావడానికి ప్రయత్నించే భక్తుని వైనం, ఈ కీర్తనలో నిందాస్తుతితో కనిపిస్తుంది.

ఎంతకూ తనను కరుణించని ఆ రాముని నమ్మకూడదని నమ్మినా ఫలమేమి ఉండదని, ఆ స్వామితో వ్యంగ్యంగా పలికే హనుమద్దాసు పలుకులు ఈ క్రింది కీర్తనలో మనకు దర్శనమిస్తాయి.

ప. రామా నిను నమ్మరాదుగా। పరం
ధామా ఫలమేమి లేదుగా
సోమ ధరనుత నామ జగదభి
రామ కలుషవిరామా సీతా ||రామా||

చ. దొరవు నీవని నమ్మినందుకూ। నన్ను
కరుణాతో జూడాని దెందుకూ।
అరయుగ సార్వభౌమను భవమైన నీ
చరణాబ్జములకు నే శరణన పనియేమి ||రామా||

పరుల బాధల కోర్వలేకా। నీకు
మొర జేసితింత పరాకా
దురితాము లెల్ల బోదోలి భక్తుల బ్రోచె
బిరుదుదాల్చి నన్ను కరుణించ కున్నావు ||రామా||

కోరి నీపదములు గాంచితి। మన్నెం
కొండ జేరే మనుభవించితీ
దారిలేదు హనుమద్దాసుని కని జను
లాడి శాయ నన్నరశి రక్షింపావు ||రామా||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–130)

దొరవని నిన్ను నమ్మినందుకు నన్నుకరుణతో చూడటం లేదు కారణమేమిటి అంటూ ఆరాముని నిలదీస్తున్నాడు. అయినా సార్వభౌమం ఈ విధంగా ఉంటే నీ చరణాల వద్ద శరణనవలసిన పనేముంది? ఇతరులు

పెట్టే బాధలు భరించలేక నీకు మొరపెడితే ఇంత పరాకేమిటయ్యా రామా! కష్టాలన్నిటిని పోగొట్టి భక్తులనుబ్రోచే బిరుదు ఉన్నా నీవు నన్ను రక్షించలేకున్నావు. నేను మనుసుపడి నీ పాదాలు సేవించి మన్నెంకొండ చేరి ఏమనుభవించానని అంటూ ఆరాముడు ఎప్పుడూ తనపట్ల కఠినంగానే ఉన్నాడనే భావనను హనుమద్దాసు వ్యక్తపరిచాడు. ఈ హనుమద్దాసుకు వేరే దారేమిలేదు అని జనులంతా ఆరడిచేస్తూ ఉంటే కూడా రక్షించడానికి రాకున్నావు. నిన్నునమ్మడం వల్ల ఏఫలముందయ్యా అంటూ ఈ కీర్తనలలో హనుమద్దాసు తనవేదనను వ్యక్తం చేసుకున్నాడు.

హనుమద్దాసు సంకర్తన రచనలో నిందాస్తుతికి సంబంధించన కీర్తనలు ఇంకా చూపవచ్చును.

1 స. హరెరామ రామయంటె రామయా
వారే యని పల్కకున్న వేమయా||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—71)

2 ప. యిటుసేయుదురా యిది ధర్మమగునా
యెటుదోచదు నేనెవరివాడ నౌదు

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—82)

3 ప. అబ్బా పలుకవె రామన్నా! మాయమ్మా పలుకవె సీతమ్మా
గొబ్బున నేనెంతొ కొనియాడుకొన్న నీ
యబ్బాసొమ్మేమైన బ్రయవౌవ పలుకవు

(మన్నెంకొండ హమమద్దాసు కీర్తన—85)

4 ప. యేదిరా నీదయ నామీద రాదయా! నీ
పాదసేవకుడనూ యాదిలేదయా

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—94)

5 ప. గరుడ గమన కరివర దయానిధే! కాకుస్థకులాతిలకా
పరమ పురుష నతపాలన శౌరి నా
మొరవినకున్నావేరా సోరామా

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–95)

ఈ విధంగా హనుమద్దాసు తన కీర్తనల్లో వాత్సల్య, మధుర దాస్య, నిందాస్తుతి, భక్తిభావాలను, సముజ్జ్వలంగా వ్యక్తంచేసి, తాను తన్మయుడై జగత్తును తన్మయం చేశాడు. తాను రామభక్తుడై జగత్తును రామమయం చేశాడు.



నాలుగవ అధ్యాయం

# హనుమద్దాసు కీర్తనలపై రామదాసు కీర్తనల ప్రభావం

# రామదాసు-హనుమద్దాసు

ప్రజలలో భక్తిని పెంపొందించడం కోసం, ఆ పరమాత్ముని సాన్నిధ్యాన్ని పొందడం కోసం లోకంలో వాగ్గేయకారులు ఉద్భవించారు. ఆ వాగ్గేయకారులు పరమాత్ముని నామరూప గుణ లీలాదులను కీర్తించి తాముతరిస్తూ, ఇతరులను తరింప చేశారు. అటువంటి వాగ్గేయకారులు తమ కీర్తనలు పామరజనంలోకి కూడా తరలిపోవడానికి భజన సంప్రదాయాన్ని సృష్టించారు. ఆ భజన సంప్రదాయానికి తన కీర్తనల ద్వారా తుష్టిని, పుష్టిని చేకూర్చినవాడు కంచర్లగోపన్న. అతడే రామదాసు. ఇతని అడుగుజాడల్లోనే నడిచి, సంకీర్తనా వాఙ్మయాన్ని సృష్టించి, పరమార్థాన్ని సాధించిన మరో మహాభక్తుడు హనుమద్దాసు.

భగవంతుని మీద అనుకరక్తిని పెంచుకున్న భక్తుల చిత్తం ఉద్రిక్తమైనప్పుడు వారిహృదయాలు ఒకే లయలో స్పందించడం సర్వసామాన్యం. అందుకే, రామదాసు తన కీర్తనా వ్యాసంగాన్ని భజన సంప్రదాయం ద్వారా మహోన్నత స్థాయికి తీసుకొనివస్తే, హనుమద్దాసు కూడా భజన సంప్రదాయానికి వన్నెతెచ్చే కీర్తనలనే రచించాడు, రామదాసును అనుకరించి అనుసరించి ఆయనలాగానే ఆపరమాత్ముని సేవలో కాలం గడిపి మోక్షాన్ని పొందగలిగాడు.

రామదాసు నమ్మిన దైవం రాముడు హనుమద్దాసు కొలిచిన దైవం కూడా రాముడే, ఇద్దరూ ఆ రామునే నమ్ముకొని ముక్తిని పొందారు. కీర్తన రచనలో, నడకలో రామదాసు పద్ధతినే హనుమద్దాసు అనుసరించాడు. రామదాసు ప్రభావం హనుమద్దాసు మీద ప్రసరించడం వల్లనే ఆ రచనా శైలిలో, సేవాభావంలో సామ్యం స్పష్టంగా కనిపిస్తుంది.

రామదాసు ప్రభావం హనుమద్దాసు మీద ముఖ్యంగా రెండు విధాలుగా చూపించవచ్చు. అది శబ్దానుకరణ, భావానుసరణ హనుమద్దాసు రామదాసుయొక్క శబ్దాలను అనుకరించాడు భావాన్ని అనుసరించాడు.

## శబ్దానుకరణ

హనుమద్దాసు తనకు ముందటి కీర్తనాపరుడైన రామదాసు వాడిన శబ్దాలను కొన్నిచోట్ల యథాతథంగా వాడాడు. ఈ శబ్దానుకరణం రచనా రీతిలో మనకు తెలుస్తుంది. ఇద్దరు వాగ్గేయకారులు రామునే కీర్తిస్తున్నప్పటికి ఒకే శబ్దాలు వాడవలసిన అవసరంలేదు. కాని ఒకరి ప్రభావం మరొకరిమీద ప్రసరించినప్పుడు ఆ రచనా శైలినే అనుకరించడం సహజం. హనుమద్దాసు పట్లకూడా ఈవిషయమే నిజమైంది. ప్రభావంలో భాగంగానే హనుమద్దాసు కీర్తనల్లో రామదాసు కీర్తనల నడక సొబగు కనిపిస్తుంది. ఇద్దరు కీర్తించే స్వామి ఒక్కడే. ఇద్దరూ ఆ పరమాత్ముని సాన్నిధ్యాన్ని పొందడం కోసమే తపిస్తున్నారు.

## తారక మంత్ర ప్రాశస్త్యంలో అనుకరణ

తారకమంత్ర ప్రాశస్త్యాన్ని వర్ణిస్తున్న రామదాసు

'తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా!
మీరిన కాలుని దూతల పాలిటి
మృత్యువు యని నమ్మకయున్న'' ||తారక||

(రామదాసు కీర్తన-1, పేజి-19)

అని అంటే, ఆ తారకరాముని సేవలోనే కాలం వెళ్ళబుచ్చదలచు కున్న హనుమద్దాసు,

"ఊరిక దొరకదు తారక మంత్రము
ఉపమ దెలియరా వోరన్నా
సారెసారెకును సద్గురు మంత్రము
కోరి పఠించర వోరన్నా"
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-1, పేజి-13)

అంటూ ఆ రామదాసు శైలిని అనుకరించాడు.

## ధ్యానంలో అనుకరణ

పరంధాముడైన రాముని ధ్యానంలోనే కాలంగాడిపే హనుమద్దాసు మీద, ఆ పరంధామునే నమ్ముకున్న రామదాసు ప్రభావం పడింది,

రామచంద్రుని భజిస్తూ రామదాసు

"భజరే మానస రామం
భజరే మానస రామం
కరధృత శరకోదండం
కరితుండా యుత భజదండం" ||భజరే||
(రామదాసు కీర్తన-2, పేజి-18)

అంటూ మనసులో రాముని నిలుపుకొని కీర్తిస్తూ ఉంటే హనుమద్దాసు కూడా ఆ రాముని స్మరణంలోనే కాలం గడుపుతూ

శ్రీరామ భజరే మానసా
తారకనామ సుధామయ రూపం
దాశరథం సౌందర్య కలాసం మానసా" ||శ్రీరామం||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-9, పేజి-20)

అని దశరథరాజ నందనుడి నామరూపగుణ శీలాదులను మనసులో నిలుపు కొని కీర్తించారు. ఈ కీర్తనలను ఇంచుమించు సంస్కృత భాషలోనే రచించడం విశేషం.

## ఆహ్వానంలో అనుకరణ

"రామభద్ర రారా శ్రీరామచంద్ర రారా
తామరసలోచన సీతాసమేతా రారా
ముద్దు ముద్దుగారగ నవమోహనాంగ రారా
నిద్దంపు చెక్కుల్భవాడ నీరజాక్ష రారా"
(రామదాసు కీర్తన- 84, పేజి-9)

అని రామదాసు ఆత్మీయ భావంతో సీతాసమేతుడైన రామభద్రుని నవమోహన రూపాన్ని వర్ణిస్తూ ఆహ్వానిస్తుంటే, ఆయన అడుగు జాడల్లో నడిచిన హనుమద్దాసు కూడా

"సీతాసమేత రారా! శ్రీ సీతాసమేత రారా
సీతాసమేత పాతక హరనాదు
దాతావనుచు నిమ్ము దలచి భజించెద రారా
ముద్దూముద్దూలు గుల్కు మోమును జూపర
వద్దూ శేటికి నా వద్దికి వేవేగ రారా"
(మున్నంగొండ హనుమద్దాసు కీర్తన-10, పేజి-21)

అంటూ ఆత్మీయుడిగా సీతా సహిత మున్మోహన సుందరాకారుడైన శ్రీరాముని మనసారా పిలిచాడు.

## శరణాగతిలో అనుకరణ

"రాముని వారము మాకేమి విచారము
స్వామి నీదే భారము దాశరథీ నీవాధారము"
(రామదాసు కీర్తన-10, పేజి-52)

అంటూ రామదాసు ఆ పరమాత్ముడి వానిగా తనను తాను అభివర్ణించు కుంటే, ఆ రామునే నమ్ముకున్న హనుమద్దాసు కూడా

"రాముల నమ్మిన వారము! మేమూ
రామ రామయను వారము"
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-13, పేజి-23)

అని ఆ పరంధాముని మీద భారం వేసి తాను మాత్రం నిమిత్తమాత్రు నిగా ఉండిపోయాడు. 'శరణాగతత్రాణ బిరుదాంకితుడవు గావా' అని రామదాసు ప్రశ్నిస్తే, 'శరణాగతత్రాణ బిరుదు గలిగిన దొడ్డ దొరవాను కున్నానురా' అంటూ హనుమద్దాసు ఆ రామునిమీద తను ఏర్పరుచు కొన్న నమ్మకాన్ని తెలియజేశాడు.

## రామ సేవార్థం రమ్మని ప్రజలకుద్బోధ

సర్వాంతర్యామి అయిన భగవంతుని ఆరాధిస్తూనే, తాను కొలిచే ఆ రామచంద్రుడు భద్రాచలంలో కొలువై ఉన్నాడని తెలిసి, ఆ పుణ్య క్షేత్ర సందర్శనం చేసుకొని ఆ రామచంద్రుని తనివితీరా చూసుకోవా లన్న కోరికను ప్రతి రామభక్తుడు వెలిబుచ్చుతాడు. నిరంతరం ఆ రాముని సేవలోనే కాలంగడిపి జీవితాన్ని ధన్యం చేసుకొనే వాగ్గేయకారులు ఆ భద్రాచలధాముని దర్శించాలనుకోవటం ఆశ్చర్యమేమికాదు.

ఆ కోరికతోనే రామదాసు

"కలియుగవైకుంఠము భద్రాచల నిలయము
సేవింతము సేవింతము ||కలి||
అలివేణులార మీరానందముగ వేగ
విలసితమైనట్టి వేడుక చూడరె" ||కలి||
(రామదాసు కీర్తన-78, పేజి-84)

అంటూ తన వాంఛితాన్ని వెలిబుచ్చితే హనుమద్దాసు సైతం

రారే రారే భద్రాద్రికి పోదాము
రారే గోదావరి తీరామునను
రఘు వీరూని సన్నిధి
కోరిసేవింతము'' ||రారే||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-17)

అని ఆ భద్రాచల రాముని కొలవడానికి సంసిద్ధుడైనాడు.

## భగవంతుని ప్రశ్నించడంలో అనుకరణ

రామదాసు తాను నమ్మిన రాముడు తనను కరుణించక పోవడంతో ఆ రామునే

ప. ''ఏల దయరాదో రామయ్య
ఏలదయరాదో రామయ్యనీకు

చ. శ్రీ మేలుకై పాటు పడితినని యేల
ఱూ యభాండము చాలు చాలును

(రామదాసు కీర్తన-55, పేజి-5.)

అని బాధతో ప్రశ్నిస్తూ ఉంటే హనుమద్దాసు కూడా

ఏల నీకు దయరాదురా। సీతారామ।
ఏల నీకు దయరాదురా।।
ఏల నీకు దయిరాదు నీల మేఘశ్యామ సుందర
మేలుగ నన్నేలుటకు చాల భారమాయెనేమొ

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన-70, పేజి-76)

## రామదర్శనానందంలో పాడిన కీర్తనలో అనుకరణ

అనవరతం ఆ రాముని ధ్యానంలోనే కాలం గడుపుతున్న భక్తునికి ఒక మహత్తర క్షణంలో ఆ పరమాత్ముని దర్శనం లభిస్తే, ఆనంద

పారవశ్యంలో మునిగిపోతాడు. తనువెల్ల పులకరించి పోతూ ఉంటే. ఆ రామచంద్రుని, ఉప్పొంగిన ఆనంద హృదయంతో కీర్తిస్తాడు. అలాగే హనుమద్దాసు కూడా

"కనుగొంటి కనుగొంటి రాములా! నా
కన్నులాన పరంధాములా
కనుగొంటి కనుగొంటి ఘన రామచంద్రుల
కనుగొన్నంతటిలోన కనుచిత్రమాయను ||కనుగొంటి||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—38)

అంటూ ఆలోకగా ఆలపించాడు. ఈ కీర్తనపై రామదాసు, తనకు రామదర్శనం లభించినప్పుడు పులకాంకితుడై పలికిన

కంటి మా రాములను కనుగొంటి నేను
కంటి నేడు భక్తగణముల బ్రోచు మా
యింటి వేలుపు భద్రగిరి నున్నవాని" ||కంటి||

(రామదాసు కీర్తన—89, పేజి—94)

అన్న కీర్తన ప్రభావం కనిపిస్తుంది.

"చెలువొప్పు చున్నట్టి సీతాసమేతుడై
కొలువు తీరిన మా కోదండరాముని"

మాపాసని రామదాసు ఆనందపడితే,

"మందయాన ముద్దుమగువ సీతమ గూడి
అందాముతోడత యురుదెంచిన"

రాముడు తనకు దర్శన భాగ్యం కలిగించాడని హనుమద్దాసు తన హృదయానందాన్ని మృదుమధురంగా వ్యక్తంచేశాడు.

పరంధాముడు గరుడగమనుడు, ఆ స్వామికి సేవచేస్తూ కాలం గడపడానికి పక్షిరాజేంద్రుడు ఎంత పుణ్యం చేసుకున్నాడో, చివరికి

ఆ స్వామిని భక్తులు 'గరుడగమన' నామంతో సైతం పిలుస్తున్నారు. అందుకే కాబోలు రామదాసు

"గరుడగమన రారా నను నీ కరుణనేలు కోరా
పరమ పురుష యే వెరపు లేక నీ
మరుగు జొచ్చితిని అరమర సేయకు ||గరుడ||

(రామదాసు కీర్తన–18, పేజి–36)

అంటూ ఆ ఖగరాజవాహనుని వేడుకుంటే హనుమద్దాసు కూడా

గరుడగమన కరివరదయానిధె! కాకుస్థకులాతిలకా!
పరమ పురుష నత పాలనశౌరి నా
మొరవిన కున్నావేరా ఓరామా ||గరుడ||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–95, పేజి–94)

అని ఆ ఇక్ష్వాకు కుల తిలకునికి ఆర్ద్రహృదయంతో తన మొర విన్న వించుకున్నాడు.

## భజన పద్ధతిలో అనుకరణ

భజన గీతాలల్లో ఎక్కువగా ప్రచారం పొందిన రామదాసు కీర్తన

"పాహిరామా ప్రభో పాహి రామా ప్రభో
పాహిభద్రాద్రి వైదేహిరామాప్రభో ||పాహి||

(రామదాసు కీర్తన–79, పేజి–85)

శరణాగతత్రాణుడైన ఆ స్వామిని వేడుకుంటున్న రామదాసు మనోభావం ఈ కీర్తనలో స్పష్టంగా కనిపిస్తుంది. ఇది సంస్కృత భాషలో రచించబడిన కీర్తన హనుమద్దాసు కూడా పరమాత్మునికి తన విన్నపాన్ని విన్నవించుకున్న తీరు రామదాసు సంస్కృత కీర్తనను స్మరింప జేస్తుంది.

"పాహినారాయణ పాహినారాయణా
పాహిభద్రాద్రి వైదేహి నారాయణా

"శ్రీమద్రామారమణ కామితార్థప్రద
శ్యామాభి రామ జయరామ నారాయణా" ||పాహి||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–18, పేజి–27)

భజన గీతాల్లో బాగా ప్రచారాన్ని పొందిన రామదాసు కీర్తనను అనుకరిస్తూ వ్రాసిన హనుమద్దాసు కీర్తన, వడకలో తీరులో కూడా రామదాసు కీర్తనను స్ఫురింప చేస్తుంది.

ఈ విధంగా హనుమద్దాసు తన కీర్తనల్లో రామదాసు ఉపయోగించిన శబ్దాలను ఉపయోగించి రాముని సాన్నిధ్యాన్ని పొందడానికి రామదాసు మార్గాన్ని అనుకరించాడు. శబ్దానుకరణలో రామదాసు ప్రభావం హనుమద్దాసు మీద పడిందనడానికి మరికొన్ని ఉదాహరణలు చూపవచ్చును.

1 నీ బంటు నయ్యేద యిందు రారా (హనుమద్దాసు కీర్తన–10)
నీ బంటు నయ్య రారా (రామదాసు కీర్తన–15)

2 రామా నిను నమ్మినావయా (హనుమద్దాసు కీ–79)
నిన్ను నమ్మి యున్న వాడను రామా (రామదాసు కీ–77)

3 నీరనె ముంచుము పాలనె ముంచుము (హనుమద్దాసు కీ–95)
పాల ముంచు నను నీట ముంచు (రామదాసు కీ–54)

4 పలుకావుగా నీ పలుకు బంగరు గాను (హనుమద్దాసు కీ–96)
పలుకే బంగార మాయెనా (రామదాసు కీ–54)

5 కట కటా యింత సంకటమైన (హనుమద్దాసు కీ–106)
కట కట నీదు సంకల్ప మెట్టిదో గాని (రామదాసు కీ 27)

6 తల్లి నను బ్రోవవే (హనుమద్దాసు కీ–138)
అమ్మ నను బ్రోవవే (రామదాసు కీ–38)

7 సుదిన మాయ నేడివ్వాళ్ళ (హనుమద్దాసు కీ–144)
దినమే సుదినము (రామదాసు కీ–45)

## భావానుసరణ

రామదాసు శబ్దాలను అనుకరించిన హనుమద్దాసు తన కీర్తనల్లో రామదాసు యొక్క పూర్తి భావాన్ని అనుకరించలేదు. ఆయన అడుగు వెనుక అడుగు వేస్తున్నవాడిగా భావించుకొని, ఆ రామదాసు భావాన్ని అనుసరించాడు. అదే భావానుసరణం అయింది.

భావానుసరణం కూడా రెండు విధాలుగా చూపించవచ్చు. రామదాసు భావాన్ని అనుసరించిన హనుమద్దాసు కీర్తనల్లో, స్వామియొక్క రూపాన్ని వర్ణించిన కీర్తనలు కొన్ని, ఆ స్వామిని స్తుతించిన కీర్తనలు కొన్ని కనిపిస్తాయి. వాటిని రూపవర్ణన, స్తుతిపరమైన కీర్తనలు అని రెండు విభాగాలుగా చేయవచ్చు ఈ రెండు విభాగాలకు సంబంధించిన కీర్తనలు ఈ అంశంలో పరిశీలించడం జరిగింది.

## రూపవర్ణన

పరమాత్ముని రూపాన్ని వర్ణిస్తూ, ఆ స్వామి స్మరణంలో నిమగ్నమై పోవడం వాగ్గేయకారులకు అలవాటే. రామదాసు, హనుమద్దాసులు కూడా ఆ దశరథ రాముని రూపాన్ని తనివితీరా వర్ణించారు. ఆ వర్ణనలోనే తమ భక్తిని ప్రదర్శించారు.

రామదాసు ఆ రామచంద్రుని రూపాన్ని వర్ణిస్తూ, ఆ స్వామి ముగ్ధమోహన రూపాన్ని దర్శించాలని కోరుకుంటూ—

ప. "రామ భద్రరారా శ్రీరామ చంద్రరారా
తామరస లోచన సీతా సమేతరారా ||రామ||

అప. ముద్దు ముద్దు గారగ నవమోహనాంగ రారా
నిద్దంపు చెక్కుటద్దముల వాడ నీరజాక్షరారా ||రామ||

చ. చుంచు రవి రేఖతో నీ సొంపు జూతురారా
పంచదార చిలక నాతో పలుకుదువు రారా
పట్టరాని ప్రేమ నా పట్టుకొమ్మ రారా
గట్టిగ కౌసల్య ముద్దు పట్టి వేగ రారా ||రామ||

నిన్నుమానలేనురా నీలవర్ణ రారా
కన్నుల పండువుగా కందు కన్న తండ్రి రారా
అందెలు మువ్వలచేత సందడింప రారా
కుందనపు బొమ్మ యెంతో అందగాడ రారా ||రామ||

నాయెడల దయయుంచి నల్లనయ్య రారా
బాయక యెప్పుడు నీబంటు నయ్య రారా
పాదుకొన్న ప్రేమ నిబ్బరమాయె రారా
పాదసేవకుడాను నే ప్రత్యేకముగ రారా ||రామ||

ముజ్జగములకు నాదిమూలబ్రహ్మ రారా
గజ్జల చప్పుళ్ళు ఘల్లు ఘల్లుమన రారా
సామగానలోల నా చక్కనయ్య రారా
రామదాసు నేలిన భద్రాద్రివాస రారా ||రామ||
(రామదాసు కీర్తన—84, పేజి—౯1)

అంటూ స్వామిని పిలుస్తుంటే హనుమద్దాసు—

ప. సీతా సమేత రారా శ్రీసీతాసమేత రారా
సీతాసమేతా పాతక హరనాదు
దాతావనుచు నిమ్ము దలచి భజించెద రారా ||సీతా||

చ. ముద్దూ ముద్దూలు గుల్కూ మోమిటు జూపర
వద్దూలేటికి నా వద్దికి వేవేగ రారా ||సీతా||
మేలూ మేలూరని లీలా వినోదము
చాలా దలచి మది నోలలాడెదు యిందురారా ||సీతా||

కంటి వింటి నీవంటి దైవము లే
దంటినె నీ బంటు నయ్యేద యిందు రారా ||సీతా||
యేది యేదిర నీ పాదబ్జములనే
మోదముతోడుత మ్రొక్కి శేవింతు యిందు రారా ||సీతా||
వాసవనుత హనుమద్దాస పోషణ శ్రీని
వాసా భద్రాద్రినివాసా కోదండపాణి రారా ||సీతా||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–10, పేజి–21)

అంటూ భద్రాద్రి నివాసుని పిలుస్తున్న హనుమద్దాసు పిలుపులో రామదాసు ప్రభావం గోచరిస్తుంది.

మానవుని మనసులో స్వభావసిద్ధంగా దైవతత్త్వమైన ప్రేమ ఉంటుంది. దాని అనుభవరూపమే ముద్దు. ఆ ముద్దుతోనే రామదాసు ముద్దు లొలుకుతూ రమ్మని అనవమోహనాకారుని పిలుస్తుంటే ముద్దులు కులికే మోమును తనకు చూపించమని హనుమద్దాసు ఆ స్వామిని వేడుకున్నాడు. రాముని తన స్వామిగా భావించి 'నీబంటునయ్యరారా' అని రామదాసు అర్థిస్తే, ఆ రామునే 'నీబంటునయ్యేదయిందురారా' అంటూ హనుమద్దాసు వేడుకోవడం చిత్రమనిపిస్తుంది. రామదాసు తన కీర్తనలో దాస్యభక్తిని ప్రదర్శిస్తే, హనుమద్దాసూ దాస్యభక్తిని ప్రదర్శించాడు. కౌసల్యా నందనుని చూడటానికి రామదాసు పడే ఆవేదన, హనుమద్దాసు కీర్తనలో కూడా వ్యక్తమైంది. పై రామదాసు కీర్తనలోని భావాన్ని అనుసరించిన హనుమద్దాసు కీర్తన మరొకటి–

ప. "చూచేను రా రామ చూచేనురా నీ
చిందార నగు మోము జూచేనురా
చానొందనాకు మీ దండి సంస్థానము
గాంచినందుకు నిన్ను గనుగొన్నదే చాలు ||చూచేను ||
చ. నిలువెల్ల సొమ్ములు నీలావయ్యారము
చెలుగాక నీమోము జూచేనురా ||చూచేను||

నిద్దంపు చెక్కిళ్ళు నీలాల పోగులు
ముద్దూ ముద్దూల మోము జూచేనురా ||చూచేను||

బుక్కాగులాల్ పూలా వసంతము
చక్కానయ్యా మేన జల్లేను రా ||చూచేను||

పూసీన మంచి మల్లెపూల దండలు పూజ
జేసి నీ మెడనిండ వేసేను రా ||చూచేను||

మంచి మిఠాయి మామిడి పండ్లు లా
లించి నీ వడి నిండ నించేనురా ||చూచేను||

వామాంకమందు సీతా వయ్యారమై యున్న
క్షేమాము నీ మోము జూచేనురా ||చూచేను||

మావారు వద్దని మందలించినా నీ
సేవా జేయుచు నిన్ను జూచేనురా ||చూచేను||

దండీ మన్నెము కొండ ధామా రామ నీకు
దండాము నీమోము జూచేనురా ||చూచేను||

హనుమద్దాసుని పాలి ఘనుడవనుచు నా
మనసు దీరగ నిన్ను జూచేనురా ||చూచేను||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–74, పేజి–79)

ఈ విధంగా ఈ కీర్తన సాగిపోతుంది.

రామదాసు కీర్తనలో రాముని రమ్మని పిలిచే ఆహ్వానం కనిపిస్తుంది కాని ఈకీర్తనలో హనుమద్దాసు తను చూడబోయే రాముని గురించి వర్ణిస్తున్నాడు. ఇద్దరి కీర్తనల్లోను రాముని రూపవర్ణనా భావమే ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. "నిద్దంపు చెక్కిళ్ళ వాడా నీరజాక్షరాగా" అని రామదాసు పిలిస్తే, "నిద్దంపు చెక్కిళ్ళ నీలాల పోగులతో నున్న ముద్దుమోమును చూస్తానని హనుమద్దాసు ఆనందపడుతున్నాడు.

శ్రీరాముడు ఎంత ముద్దో, ఎంత సొగసో, ఆ ఇనకుల తిలకుని వర్ణించడం ఎవరితరం! అయినా తమకు చేతనైనంతగా ఆ కౌసల్యా నందనుని రామదాసు, హనుమద్దాసు లిద్దరూ వర్ణించారు.

భగవంతుని కోసం అనుక్షణం పరితపించే భక్తునికి ఆ పరంధాముని దర్శనం లభిస్తే అతను అనుభవించే ఆనందం వర్ణనాతీతం. రాముని నామ రూపగుణ లీలాదులను వర్ణిస్తూ అనవరతం సీతామనోహరుని స్మరణంలోనే కాలం గడిపిన భక్తులకు ఆ స్వామి కనిపించగానే వారు ఒకే అనుభూతిని పొందడం అసహజమేమీ కాదు. వారు వర్ణించే ఆ పరమాత్మ రూపం ఒకటే కావచ్చు. అదీ, ఇద్దరికీ కనిపించిన వాడు రాముడే అయితే అందులో అతిశయోక్తి అసలుండదు.

రామచంద్రుని దివ్యరూప సందర్శనం పొందిన రామదాసు ఆనందంతో ఆ రాముని వర్ణించాడు.

ప. కంటి నారాములను కనుగొంటి నేను

చ. కంటినేడు భక్తగణముల బ్రోచు మా
యింటి వేల్పు భద్రగిరి నున్నవాని ||కంటి||

కలువొప్పుచున్నట్టి సీతాసమేతుడై
కొలువు తీరిన మా కోదండరాముని ||కంటి||

తరణికుల తిలకుని ఘననీల గాత్రుని
కరుణారసము కురియు కందోయి గలవాని ||కంటి||

హారము మంచి ముత్యాల సరములు మెరయగ
మురిపెంపు చిరునవ్వు మోముగలిగిన వాని ||కంటి||

మెల్ల మెల్లనను పైడిగజ్జెలందెలు మ్రోయ
తళుకు బెళుకు పాదతలము గలిగిన వాని ||కంటి||

కరకు బంగరు చేల కాంతి జగములు గప్ప
శరచాపములు కేలదరియించు స్వామిని ||కంటి||
ధరణిపై శ్రీరామదాసు నేలేడువాని
పరమ పురుషుండైన భద్రగిరి స్వామిని ||కంటి||
(రామదాసు కీర్తన–89, పేజి–94)

భక్తులను బ్రోవడం భగవంతుని యొక్క ధర్మం. అటువంటి భక్తత్రాణపరాయణుడైన రాముని రామదాసు చూచాడట. ఘననీలగాత్రుడు కరుణారసం కురిపించే కన్నుదోయి గలవాడు, మురిపెంపు చిరునవ్వు మోముకలిగిన వాడు, సీతాసమేతుడై కొలువుతీరి ఉంటే రామదాసు వీక్షించాడట. అంతటి సొగసుగాడైన ఆరామునే నేను చూశానన్నట్లుగా హనుమద్దాసు—

ప. కనుగొంటి కనుగొంటి రాములా। నా
కన్నులాన పరంధాములా

చ. కనుగొంటి కనుగొంటి ఘన రామచంద్రుల
కనుగొన్నంతటిలోనే కనుచిత్రమాయెను ||కనుగొంటి||

సుందరమగు మోము గుల్కగా। దయ
చూపురసము నాపై జిల్కగా
మందయాన ముద్దుమగువ సీతనుగూడి
అందాము తోడుత యరుదెంచగా నేడు ||కనుగొంటి||

నీల మేఘశ్యామ బాలుని దివ్య
లీల బ్రహ్మానంద ఖేలుని
చాలు ముంగురులు నీలాలాతో పరిబోలు
మేలురాడు నమ్ము పాలించగరాగను ||కనుగొంటి||

కరకంకణమ్ములు ఘల్లనగా। దివ్య
భరణ కాంతి ధళుక్కనగా

పరమ సంతోషాన చిరునవ్వు మోముతో
గరుడ వాహనమెక్కి దొరవాలె రాగను ||కనుగొంటి||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–88, పేజి–88)

అగణిత వైభవధీరుడైన రామచంద్రుడు చిరునవ్వు మోముతో [illegible] లు ఘల్లు ఘల్లు మంటుంటే, దయారసము చిందేచూపులు ప్రసరింపచేస్తూ, ముద్దుమగువ సీతను గూడి గరుడ వాహన మెక్కి వస్తుంటే అప్పుడు చూసాడట హనుమద్దాసు.

ఘల్లు ఘల్లుమను పైడిగజ్జెలందెలు మ్రోయగా, కరుకుబంగారు చెంగావి జిగములు కప్పే విధంగా ఉన్నాడని తాను చూసిన రాముని గురించి రామదాసు వివరిస్తే, కరకంకణములు ఘల్లుమంటుంటే కన కాంబరకాంతి దనరెటట్లు ఉన్న సీతాస్వామిని తాను వీక్షించానని హనుమ ద్దాసు చెప్పుకున్నాడు. శరచాపములు చేతిలో ధరించిన వాడు రామదాసు రాముడైతే ఘనమైన శంఖచక్రాలు కరద్వయంలో ధరించిన వాడు హను మద్దాసు రాముడు. రామదాసు, హనుమద్దాసు ఇద్దరూ ఆ పరంధాముని చూసిన ఆనందములో మైమరచిపోయి చేసిన గానం కీర్తనా రూపాన్ని పొందింది. తాను దర్శించిన రామునే రామదాసు వర్ణిస్తే, తనకు కన్పించిన రామునే హనుమద్దాసు అభివర్ణించాడు. స్వామి రూపవర్ణనే కాకుండా, గుణ సౌందర్యాన్నికూడా తమ కీర్తనల్లో వర్ణించారు. ఈ విధంగా రూప వర్ణనలో రామదాసు ప్రభావం హనుమద్దాసుమీద కనిపిస్తుంది.

## స్తుతిపరమైన-కీర్తనలు

రామభద్రుని రూపవర్ణన తరువాత, ఆ స్వామిని స్తుతిస్తూ చేసిన కీర్తనల్లో కూడా హనుమద్దాసు మీద రామదాసు ప్రభావం కొన్ని చోట్ల స్పష్టంగాను కొన్నిచోట్ల అస్పష్టంగాను కనిపిస్తుంది. రామదాసు [illegible] రాముడు, హనుమద్దాసు కీర్తించే రాముడు, ఆ సర్వాంతర్యామి [illegible] ఘనంగానే. ఆ భద్రాచలధాముడే.

రాముని స్మరించే మంత్రమే రామమంత్రం. ఇది తరింప చేసే మంత్రం కనుక తారకమంత్రం అయింది. రామ మంత్రానికి తరింప చేసే శక్తి ఉందని భక్తుల నమ్మకం. మనకు తెలిసినంత వరకు భక్తి, అతి పురాతన రూపం మంత్రం, లేదా భగవంతుని యొక్క దివ్యనామ జపం. వాక్కులో భగవంతుని రూప మాహాత్మ్యలను అభివ్యక్తం చేయడమే మంత్రం లేదా దివ్యనామం. రామమంత్రంలో భవసాగరాన్ని తరింప చేసే శక్తి ఉంది. అందుకే రామదాసు తనకు ఆ తారక మంత్రం లభించిందన్న ఆనందంతో ఆ రామమంత్రి ప్రాశస్త్యాన్ని వర్ణించాడు.

ప. తారకమంత్రము కోరిన దొరికెను
ధన్యుడ నైతిని ఓరన్నా

అ ప. మీరిన కాలుని దూతల పాలిటి
మృత్యువుయని నమ్మక యున్న ||తారక||

చ. మచ్చికతో నితరాంత రమ్ముల
మాయలలో పడబోకన్నా
హెచ్చుగ నూట యెనిమిది తిరుపతు
లెలను తిరుగ పనిలేదన్నా ||తారక||

ముచ్చటగా తాపుణ్య నదులలో
మునుగుట పనియేమిటి కన్నా
వచ్చెడి పరువపు దినములలో
నుడిపడుటలు మానక యున్న ||తారక||

ఎన్నిజన్మములు ఎరుకతో జూచిన
ఏకో నారాయణుడన్న
అన్నిరూపులై యున్న పరాత్పరు
నా మహాత్మని కథవిన్నా ||తారక||

........ ........ ........
........ ........ ........

(రామదాసు కీర్తన–4, పేజి–19)

గురువు మంచి తారక మంత్రాన్ని పొందిన రామదాసు అది తనకు లభించిన సంతోషముతో తాను పొందిన ధన్యత్వానికి మురిసిపోతూ తారక మంత్రం యొక్క గొప్పతనాన్ని వివరించాడు. సర్వాంతర్యామి అయిన భగవంతుడు ఒక్కడే అన్న విషయాన్ని 'ఎన్ని జన్మముల ఎరుకతో జూచిన ఏకోనారాయణుడన్న' అన్నమాటలో అందంగా చెప్పాడు. ఎన్ని జన్మల నుంచో ఎదురు చూస్తున్న మోక్షం ఈ జన్మలో సిద్ధిస్తుందని, ఇది సత్యమని, ఇక పునర్జన్మ లేదని ఇదంతాకూడా తారకమంత్ర మాహాత్మ్యం వల్లనే పొందగలుగుతామని రామదాసు నిర్మల చిత్తంతో తారకమంత్ర ప్రాబల్యాన్ని వివరించాడు.

హనుమద్దాసు తనగురువైన అమ్మన్నద్వారా పొందిన తారక మంత్రాన్ని ఇతరులు కూడా తెలుసుకొని ధన్యులు కావాలని చెపుతూ అది ఊరికే లభించదని కష్టపడాలని వివరిస్తూ తనకీర్తనలో తారక మంత్రాన్ని గురించి ఇలా వర్ణించాడు.

ప. ఊరిక దొరకదు తారక మంత్రము
ఉపమ దెలియరా ఓరన్నా

అ. ప. సారె సారెకును సద్గురు మంత్రము
కోరి సేవించర ఓరన్నా ||ఊరిక||

చ. కామ క్రోధముల కడకు జిమ్మి ని
ష్కామిని గమ్మిక ఓరన్నా
తామస మణచియు తత్త్వము
దలచియు ధన్యత నందర ఓరన్నా ||ఊరిక||

రామ మంత్రమభి రామ మనుచు
గురువా రహస్యము గనరా ఓరన్నా
నీ మదిలోపల నిలకడ సద్గతి
సేమము నందర ఓరన్నా ||ఊరిక||

సాధనాంతరము చనిలేదని
గురూబోధాలించర ఓరన్నా
బోధానందం బాధారంబని
పొందక గనరా ఓరన్నా ||ఊరిక||

........ ........ ........
........ ........ ........

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–1, పేజి–13)

తారకమంత్రం యొక్క గొప్పతనాన్ని చెప్పదలచుకున్న హనుమద్దాసు, రామదాసు భావాన్ని అనుసరించాడు. ఆ తారకమంత్రం సిద్ధించాలంటే కామక్రోధాది దుర్గుణాలను వదలాలని గురుబోధను ఆలకించాలని హనుమద్దాసు భక్తులకు సూచించాడు. తారకమంత్ర స్మరణంలో రామదాసు భావాన్నే అనుసరించాడు. పునర్జన్మ రాహిత్యాన్ని గురించి చెప్పిన రామదాసు ప్రభావం ఈ కీర్తనలో హనుమద్దాసు మీద కనిపిస్తుంది. జనన మరణాల గురించి ఇక ఆలోచించవలసిన అవసరంలేదని తారక నామాన్ని తనివితీరా మనసులో తలుచు కున్నట్లయితే పునర్జన్మ రాహిత్యం కలుగుతుందని చెపుతూ "జనన మరణముల జందకు, జన్మము పునహాలేదురా ఓరన్నా" అన్న హనుమద్దాసు పలుకులు, "అన్నిటికిది కడసారి జన్మము సత్యంబిక పుట్టుటసున్న" అని చెప్పిన రామదాసు మాటలకు అనుసరణీయాలే.

ఆపత్క్షణం తాను కీర్తించే రాముని, తాను నమ్ముకున్న రాముని తనకు కష్టం వచ్చిందని తనను రక్షించమని, నిన్నేనమ్ముకున్నానని రామదాసు వేడుకుంటున్నాడు.

స. నిన్ను నమ్మి యున్నవాడను ఓరామ

చ. నిన్ను నమ్మనవాడ పరులను వేడనిక
మన్ననజేసి పాలింపవే ఓరామ ||నిన్ను||

బ్రతిమాలి బ్రతము చెడుటే గాని యిదేమి సుఖము
వేతనొందగ జాలనే ఓరామ ||నిన్ను||

మానము విడిచి కసుమాల పొట్టకొరకై
మానవుల వెంబడింతునె ఓరామ ||నిన్ను||

సతతము రక్షించు చతురత నీకున్నప్పుడు మది
చంచలింప నేటికే ఓరామ ||నిన్ను||

సతతము భద్రాద్రిస్వామి శ్రీరామదాస
పతివై నన్నాదరింపవే ఓరామ ||నిన్ను||

(రామదాసు కీర్తన–,77 పేజి-84)

నిన్ను నమ్మియున్నవాడను రామా అంటూ తన ఆవేదనను ఆ పరంధామునికి విన్నవించుకున్నాడు. ఆ స్వామి త్వరగా రాలేదని కాబోలు బ్రతిమాలి బ్రతుకు చెడటమే తప్ప నువ్వు రక్షించవేమిటయ్యా అంటూ కాస్త నిష్ఠూరంగా అడుగుతున్నాడు రామదాసు.

రామదాసునే అనుసరిస్తూ వచ్చిన హనుమద్దాసు కూడా స్వామికి తన విన్నపాన్ని అలాగే తెలుపుకున్నాడు అందుకే—

ప. రామా నిను నమ్మినానయా నే
సామాన్యం వేడలేనయా
కామాంధ కారుల కపట వికారుల
నే సందర్శించాను ఓ మండలోద్ధార ||రామా||

చ. హరిహర సర్వాంతర్యామి నీ న
న్నాదుకొనే భక్తి కాని నీ
పరిపూర్ణముగ నీవు ప్రత్యక్షమై నాకు
వచ్చిన మెచ్చియు దరిచేర్చు నాతండ్రి ||రామా||

యిదినీకు బహుగొప్పతనమా! నన్ను
యిట మోసపుచ్చుట ఘనమా
పదివేలకైనా నీపదములు విడవను
ఉదర పోషణమున కొకరిని వేడను ||రామా||

దండి మన్నెముకొండ ధరణీవంటి హనుమ
ద్దాస రక్షణ చింతామణి వంటి
నిండు సత్కృపనేడు నీకు గలిగి యుండెపొ
పండు దొరికినట్లు లుండు మాకిక జాడ ||రామా||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—79, పేజి-82)

'నిన్ను నమ్మియున్నవాడను ఓరామా' అని రామదాసు పలికితే, ఆయన ప్రతిభావం హనుమద్దాసు తాను నమ్ముకున్న రాముణ్ణి వేడుకొనే తీరు నిండుపడింది. రామా నిన్నేనమ్మినానయా అంటూ తన ఆవేదనను వ్యక్తం చేశాడు 'నిన్నునమ్మినవాడను పరులను వేడనిక' అని రామదాసంటే, రామా నినునమ్మినానయా నేసామాన్యుల వేడలేదయా అంటూ తన అభిమతాన్ని వెలువరించాడు. 'మానము విడిచి పొట్టకోసమని మానవులను వెంబడిస్తానా రామా 'అని రామదాసు ప్రశ్నిస్తే, ఉదరపోషణమున కొకరిని వేడను' అంటూ హనుమద్దాసు స్వామికి నివేదించుకున్నాడు.

సర్వాంతర్యామి అయిన ఆ పరమాత్ముడే రామభద్రునిగా ఇలలో అవతరించాడు, భద్రాద్రిలో సీతాలక్ష్మణ సమేతుడై నెలవై ఉన్నాడు. ఆ రాముని దర్శనం కోసం, భద్రాచలధాముని దివ్యరూప సందర్శనం కోసం ప్రతిభక్తుడు ఎదురుచూస్తూనే ఉంటాడు. ఆ భద్రాద్రిని కలి యుగ వైకుంఠంగా అభివర్ణిస్తాడు

ప. కలియుగ వైకుంఠము భద్రాచల నిలయము
సేవింతము సేవింతము

అ. ప. అలివేణులార మీరానందముగ వేగ
విలసితమైనట్టి వేడుక చూడరె ||కలి||

చ. కాంచన సౌధములు మానికములు మించిన దూలములు
వజ్రములు చెక్కించిన స్తంభములు
పగడములసి భ్రమియించు ద్వారములు
అంచయాన మరి యెంచలేరు గదే
మంచి పచ్చలు కూర్చిన వాకిళ్ళు ||కలి||

బంగారు గోపురములు దేవళముల వెలుగు మాణిక్యములు
భేరీ మృదంగాది నాదములు
భాగవతుల సంకీర్తనలు
రంగైన కళ్యాణ మంటపములు
శృంగారమేమని చెలియ విన్నవింతు ||కలి||

........ ........ ........
........ ........ ........

(రామదాసు కీర్తన–78. పేజి–84)

అని రామదాసు భద్రాచలాన్ని కలియుగ వైకుంఠంగా అభివర్ణించాడు. కాంచన సౌధములట, బంగారు గోపురములట, రంగైన కళ్యాణ మంటపములట వీటన్నిటో భద్రాచలం వెలిగిపోతూ ఉంది. ఆ మహా క్షేత్రాన్ని ఎంత వర్ణించినా తనివి తీరదు. ఎంత మంది వర్ణించినా విసుగు పుట్టదు. రామదాసు తాను చూసిన భద్రాచలాన్ని మనోహరంగా వర్ణించాడు. హనుమద్దాసు కూడా ఆ రాముని నివాసమైన భద్రాద్రిని అపురూపంగా వర్ణించాడు. ఈ వర్ణనలో అక్కడక్కడ రామదాసు భావాన్ని అనుసరించాడు.

ప. రావే రావే భద్రాద్రికి పోదాము

అ ప. రారే గోదావరి తీరమునను రఘువీరుని
సన్నిధి కోరి సేవింతును ||రారే||

చ. నాణెముగా భద్రానగరమందు సీతతో
రాణించు కోదండపాణి సన్నిధి జేరా ||రారే||

సిరులొందు వెలసిన సింహద్వారము పైనా
అరయ గోపురములదిగో సేవింతాము ||రారే||

చుట్టు కోవెల లెంతో సుందర మొప్పగ
గట్టుపై నరసింహ ఘనుని గనుగొన నేడు ||రారే||

........ ........ ........

........ ........ ........

భేరి మృదంగముల్ ఘోరుకొల్పుచు మ్రోయ
చేరూవ భద్రాద్రి చేరి చూతము వేగ ||రారే||

గంగా గోదావరి ఘన యమునా జలముల
పొంగి స్నానముశేయ పోదములందరు గూడి ||రారే||

........ ........ ........

........ ........ ........

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–17, పేజి–26)

అంటూ హనుమద్దాసు భద్రాచల నిలయుని చూడటం కోసం పరితపించే తన హృదయభారాన్ని వ్యక్తం చేశాడు.

భేరీ మృదంగాది నాదములు, భాగవతుల సంకీర్తనలు వినిపిస్తున్నాయని రామదాసు పలికితే, భేరీ మృదంగముల్ ఘోరుల్పుచును మ్రోగే భద్రాద్రికి వెళ్ళడానికి హనుమద్దాసు సిద్ధమయ్యాడు. నామాంకితులౌతూ ఉంటే సీతతో హేమ పీఠాన్ని అధిష్ఠించి, మోములో సంపూర్ణ కళలను ప్రసరింపచేస్తున్న భద్రాద్రీశుణ్ణి రామదాసు ఆరాధిస్తే, వామాంకమున సీత వైభవోపేతంగా మెరుస్తూ ఉంటే సొంపైన మోముతో నున్న రాముడి వద్దకు వెళ్ళడానికి హనుమద్దాసు సంసిద్ధుడయ్యాడు. భద్రాచల క్షేత్రాన్ని వర్ణించిన తీరులో, భావనా పటిమలో హనుమద్దాసు మీద రామదాసు ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

# అమ్మవారి ద్వారా స్వామికి రాయబారం

తాను నమ్ముకున్న రాముడు తనను కరుణించక పోతే, అమ్మ వారికి విన్నవించుకొనే పద్ధతిని రామదాసే ప్రవేశపెట్టాడు. ఆ పద్ధతిని హనుమద్దాసు అనుకరించాడు. తాను అనుక్షణం పూజించే రాముడు తనను కరుణించక పోవడంతో రామదాసు సీతమ్మ తల్లికి మొరపెట్టుకున్నాడు

ప. "అమ్మ నను బ్రోవవే రఘురాముని
కొమ్మ నను గావవే మా ||అమ్మ||

చ. అమ్మ నను బ్రోవవే సమ్మతితోడ మా
యమ్మవనుచు నిన్ను నెమ్మది గొలిచెద ||అమ్మ||

కన్నతల్లి నీవు కనుగొని నాపాటు
విన్నపమొనరించి వేగమే విభునితో ||అమ్మ||

యుల్లములోన మీయుభయుల నెరనమ్మి
యెల్లవేళల వేడి వేసారితి నిపుడు ||అమ్మ||

చలముమాని భద్రాశైల రామదాసు
నలసటబెట్టక యాదరణజేసి ||అమ్మ||

అంటూ రామదాసు, అమ్మవారిని వేడుకున్నాడు. కన్న తల్లి నువ్వైనా కాస్త నామొర ఆలకించమని ఆ తల్లిని ప్రార్థించాడు. రామదాసు నడచిన మార్గంలోనే పయనించిన హనుమద్దాసు కూడా, మన్నెంకొండ నుంచి తనను పంపించిన ఆస్వామి, తన మొర వినకపోవడంతో ఆ సీతామహాసాధ్వినే వేడుకున్నాడు.

ప. తల్లి నను బ్రోవవే! నతజన కల్ప
వల్లి నను బ్రోవవే

అ ప. తల్లీ నన్నుబ్రోవు యెల్లజనులకెల్ల
కొల్లగ శిరులెగ జల్లి పోషించిన ||తల్లీ||
చ. సన్నుత లీల మీ సన్నిధి దయచేసి
కన్నుల జూడు యాపన్నుడ నయున్న ||తల్లీ||
భారమాయె మదికి నిబ్బరమాయె వేగింప
తరము గాదాయె యుత్తరిని కటాక్షించి ||తల్లీ||
ధరలో మన్నెముగిరి హనుమద్దాసుని
పరులా వేడించి దెప్పరము గావించాకు ||తల్లీ||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—138, పేజి—130)

హనుమద్దాసుకు ఆ రాముడే తండ్రి, సీతమ్మే తల్లి 'అమ్మా నను బ్రోవవే' అని రామదాసు అర్థిస్తే, 'తల్లీ నన్నుబ్రోవవే' అంటూ హనుమద్దాసు కోరుకున్నాడు. తండ్రి దండిస్తే తల్లిచాటున దాక్కునే శిశువు లక్షణం ఈ భక్తుల్లో కనిపిస్తుంది. హృదయంలో మీకిద్దరినే నమ్ముకొని, ఎల్లవేళల్లో మిమ్ములను వేడుకొని మోసపోయాను అని రామదాసు తన ఆవేదన వ్యక్తంచేస్తే, 'సన్నుత లీల మీ సన్నిధి దయ చేసి కన్నులజూడు' అంటూ హనుమద్దాసు వేడుకున్నాడు. రామయ్య రాకపోతే సీతమ్మను వేడుకోవాలనే రామదాసు భావాన్ని అనుసరించిన హనుమద్దాసు ఈ కీర్తనలో ఆ భావాన్ని చక్కగా పరిస్ఫుటీకరింపచేశాడు.

తమ సర్వస్వం అనుకున్న సీ
ఆ సీతమ్మ ద్వారనే రామునికి రాయ
పలికిన వాడు రామదాసే. ఆ భావాన
ఆయన అడుగుజాడల్లోనే నడిచిన హనుమద్దాస

ప్రభుత్వ ధనం వెచ్చించి దేవాలయ
రామదాసును, తానాషా బందిఖానాలో ఉంచి
రక్షించడానికి రాకపోవడంతో, ఆ రామయ్య
వేడుకున్నాడు.

ప. నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి ||నను||

చ. నను బ్రోవమని చెప్పవే నారీశిరోమణి
జనకుని కూతుర జనని జానకమ్మ ||నను||

ప్రక్కన చేరుక చెక్కిలి నొక్కుచు
చక్కగ మరుకేళి సొక్కుచుండెడివేళ ||నను||

ఏకాంత రంగుడు శ్రీకాంత నినుగూడి
ఏకాంతమున నేకశయ్య నున్నవేళ ||నను||

అద్రిజ వినుతుడు భద్రిగిరీశుడు
నిద్రమేల్కొను వేళ నెలతరో బోధించి ||నను||

(రామదాసు కీర్తన–,65 పేజి-66)

'నను కాపాడమని ఆ రామునితో చెప్పవమ్మా ఓ సీతమ్మా' అనే రామదాసు భావనావీచికలు హనుమద్దాసు ఎదలోకూడా కదలాడాయి. అనుక్షణం ఆ స్వామి స్మరణంలోనే మునిగి పోయే హనుమద్దాసు మన్నెంకొండ నుంచి వెళ్ళగొట్టబడి, మళ్ళీ తన స్వామిని కనులారా చూస్తానో లేదో అన్న భయంతో సందేహంతో ఆ తల్లిని, పరమాత్ముని దగ్గరికి రాయబారం పంపాడు.

ప. పాలించు మని తెల్పవే! నీ విభుని నా
పాలికి రమ్మనవే

పాలించుమని తెల్పు పంకజదళనేత్రి
బాల శశాంక నిభానన దయనన్ను ||పాలించు||

నిరుపమానంద సంభరితుడౌ శ్రీహరి
మురయుచు నీతోడ ముచ్చటాడెటి వేళ ||పాలించు||

కందర్ప జనకుడు నీ కంధరమందు శ్రీ
చందనములిడి యింపొందు చుండెటి వేళ ||పాలించు||

మెరుగారు ముత్యపు సరులు శోభిల్ల నీ
యురమున జేర్చి సంబరము నొందెటి వేళ ||పాలించు||

చారుశృంగారము మీఱ నీ కచమున
కోరికతో పూలు గూర్చు చుండెటి వేళ ||పాలించు||

.......... .......... ..........

.......... .......... ..........

హనుమద్దాస నరుఁడతి దీనుడై మిమ్ము
కనిపెట్టు కున్నాడు కఠినమేలనని ||పాలించు||

(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన—139, పేజి—130)

రామునికి ఎప్పుడు తన విషయం చెప్పాలో, ఎలాచెప్పాలో కూడా హనుమద్దాసు అమ్మవారికి వివరించి చెప్పాడీ కీర్తనలో 'ప్రక్కన చేరి చెక్కిలి నొక్కుతూ చక్కగ మరుకేళి సొక్కియుండె' వేళ తనను రక్షించమని ఆ స్వామితో చెప్పాలని రామదాసు కోరుకుంటే, నిరుప మానంద సంభరితుడైన ఆ శ్రీహరి మరుసూ 'సీతోటి ముచ్చట్లాడే సమయంలో నాగురించి నాలుగు మాటలు చెప్పవమ్మా' అంటూ హను ద్దాసు అమ్మవారికి విన్నవించుకున్నాడు.

ఈ విధంగా రామదాసుని అనుసరించిన హనుమద్దాసు కొన్ని చోట్ల తనదైన ప్రత్యేక శైలిని కనపరచాడు. కీర్తనల ప్రారంభంలో రామద్దాసు వాడిన శబ్దాలను అనుకరించినా తరువాతి కీర్తనలోని భావం మాత్రం తనదైన మార్గంలో పయనించి కీర్తన రచన గావించాడు.

ప. "పలుకే బంగారమాయెనా కోదండపాణి ||పలుకే||

పలుకే బంగారమాయె పిలిచిన పలుకవేమి

కలలో నీనామస్మరణ మరువ చక్కని తండ్రి ||పలుకే||

(రామదాసు కీర్తన—54, పేజి-59)

ఈ రామదాసు కీర్తనలో ఇతర భక్తులు రాముని దయను ఏ విధంగా పొందారు అన్న విషయాలను వివరించిన వైనం కనిపిస్తుంది, రాముని దయను పొందిన ఉడుత, రాతినుంచి తన అసలు స్వరూపాన్ని పొందిన అహల్యలను గురించి రామదాసు ఈ కీర్తనలో స్పృశించాడు. పల్లవి రచనలో దాదాపు రామదాసునే అనుకరించిన హనుమద్దాసు

ప. పలుకావుగా ఓరామా నాతో| పలుకావుగా
పలుకావుగా నీపలుకు బంగారుగాను
మొలుక నవ్వుల తేనెలొలుకగ ప్రియమున ||పలుకా||

చ. పరవశమున నామొరవినలేదో
దొరతనమున నన్ను మరచియున్నావో ||పలుకా||

అలవైకుంఠ పురమందున నివసించి
పిలిచెతె నామొర ప్రియమున వినరాదో ||పలుకా||

దండి మన్నెముకొండధామ పరంధామ
దండమిదిగొ హనుమద్దాస మనోల్లాస ||పలుకా||
(మన్నెంకొండ హనుమద్దాసు కీర్తన–96, పేజి–95)

ఈ కీర్తనలో పల్లవి మినహా తరువాతి భావంలోను చరణాల్లోను ఎక్కువ సామ్యం కనిపించదు.

ప. దీనదయాళో దీనదయాళో
దీనదయాళో దీనదయాళో
(రామదాసు కీర్తన–17, పేజి–36)

అంటూ రామదాసు ఆ రాముని వర్ణిస్తే, ఈ పల్లవిని కొస్త అనుకరించి నట్లుగా హనుమద్దాసు కీర్తన నొకదానిని రచించాడు.

ప. రామదయానిధే రామదయానిధే రామదయానిధే రామదయానిధే
నాముద్దులయ్య నీముద్దుమోమిటు
ప్రేమతో జూపర రామదయానిధే

అనే పల్లవితో ప్రారంభమైన ఈ కీర్తనలో మొదట రామదాసును అనుసరించినట్లు కనిపించినా తరువాతి భావంలో ఎటువంటి సామ్యం కనిపించదు. రామదాసు కీర్తన కేవలం స్తుతిపరంగానే కనిపిస్తుంది. హనుమద్దాసు కీర్తనలో భగవంతుని ఎడబాటుకు కుమిలి పోతున్న భక్తుని ఆవేదన గోచరిస్తుంది. స్వామి వదనారవిందాన్ని వీక్షించడం కోసం తాపత్రయపడే భక్తుని నిరీక్షణ ద్యోతక మౌతుంది. రామదాసు భావాలను కొన్నిచోట్ల అనుసరించినా, కొన్నిచోట్ల మాత్రం తనదైన ప్రత్యేక శైలిని కనబరచి ఆ స్వామి సాన్నిధ్యాన్ని పొందాడు.

హనుమద్దాసు రామదాసు లిద్దరు ఆ రాముని కోసమే తమ జీవితాలను అర్పించి, ధ్యానించిన భక్తులు లోకంలో భక్తిని పెంపొందింప చేయడం కోసం ఉద్భవించిన వాగ్గేయకారులు. అనవరతం రాముని నామరూపగుణ లీలాదులను వర్ణించడమే తమ జీవిత పరమావధిగా ఎంచుకున్నవారు. మోక్షాన్ని సాధించడానికి ఇద్దరు ఎన్నుకొన్న మార్గం కీర్తనా మార్గమే. తమ తనువులోని అణువణువులో రామనామాన్ని నింపు కొని తాము తరించి లోకాన్ని తరింపచేసి, పరమాత్మలో లీనమైపోయిన మహాభక్తులు.



'మన్నెంకొండ హనుమద్దాసు కీర్తనలు—ఒకపరిశీలన' అనే నా ఈ సిద్ధాంతవ్యాసాన్ని నాలుగు అధ్యాయాలుగా విభజించడం జరిగింది.

**మొదటి అధ్యాయం:** 'వాగ్గేయకారుల సంకీర్తన లక్షణం.'
ఈ అధ్యాయంలో వాగ్గేయకార పదనిర్వచనాన్ని, వాగ్గేయకారుల లక్షణాన్ని, వారిలోని భేదాలను సహేతుకంగా వివరించడం జరిగింది. సంకీర్తనా లక్షణాన్ని, దాని ప్రారంభవికాసాలను వివరిస్తూ, అందలిభేదాలను చూపించటం జరిగింది. పూర్వవాగ్గేయకారుల పరిచయంలో సంస్కృత వాగ్గేయకారులైన జయదేవ' లీలాశుకాదులను; ఆంధ్రి వాగ్గేయకారుల్లో ప్రిముఖులైన అన్నమయ్య, క్షేత్రియ్య, రామదాసు, త్యాగరాజులను గూర్చి పరిచయం చేస్తూ, మన్నెంకొండ హనుమద్దాసును ఆ వరుసలోని వాడుగా గుర్తించి చెప్పడం జరిగింది.

**రెండవ అధ్యాయం:** 'మన్నెంకొండ హనుమద్దాసు జీవితవిశేషాలు'
ఈఅధ్యాయంలో ప్రధానంగా మన్నెంకొండ క్షేత్రాన్ని దాని మహాత్మ్యాన్ని, గూర్చి స్థానికుల అభిప్రియాలతో చారిత్రిక ఆధారాలతో వివరించి చెప్పడం జరిగింది.

మన్నెంకొండలో నెలకొన్న లక్ష్మీవేంకటేశ్వర స్వామిని అర్చించి, గుండెలో నెలకొన్న భక్తితో ఆ స్వామికి ఆలయగోపురాదులను నిర్మింపజేసి, భద్రాచల రామునికి ప్రిణతుడై, ఆ స్వామి దర్శన భాగ్యంతో తన్మయుడై గళాన్ని విప్పి, పాడుకొన్న హనుమద్దాసు పూర్వుల వృత్తాంతాన్ని సాకల్యంగా వివరించి చెప్పడం జరిగింది, హనుమద్దాసు పూర్వజన్మ వృత్తాంతం కూడా స్పృశింపబడింది. హనుమద్దాసు జననం, గురూపదేశం, భద్రాచలయాత్రి, మన్నెంకొండకు తిరిగి రావడం, గోపురప్రాకారాదుల నిర్మాణం. పుష్కరిణి మాహాత్మ్యం. దిగువ కోనేరు నిర్మాణం, స్వామివారి బ్రహ్మోత్సవాలు, ఆయన జీవితంలోని అద్భుత

సంఘటనలు, సన్మానాలు, ఆయనకు భగవంతుడు పెట్టిన పరీక్ష, ఆ పరీక్షలో ఆయన నెగ్గి భగవత్సాన్నిధ్యాన్ని పొందడం. ఇత్యాది సంఘటనలతో ఆసాంతంగా ఆయన జీవనరేఖను ఆవిష్కరించి చూపడం జరిగింది.

**మూడవ అధ్యాయం:** 'హనుమద్దాసు కీర్తనలు–భక్తితత్త్వం' ఈ అధ్యాయంలో ప్రధానంగా హనుమద్దాసు కీర్తనలలో ఆవిష్కరింపబడ్డ భక్తితత్త్వాన్ని అనుశీలించి చూపడం జరిగింది. భక్తి యొక్క నిర్వచనాన్ని, అంతరిభేదాలను, దాని పరమార్థాన్ని వివేచించి చూపి, దాసుగారి కీర్తనలలో వాత్సల్యం, మాధుర్యం, దాస్యం, నిందాస్తుతి ప్రధానంగా కనిపిస్తున్నవని సోదాహరణంగా తెల్పడం చేయడం జరిగింది.

**నాల్గవ అధ్యాయం:** 'హనుమద్దాసు కీర్తనలపై రామదాసు కీర్తనల ప్రభావం' ఈ అధ్యాయంలో ప్రధానమైంది తులనాత్మక పరిశీలన. వాగ్గేయకారుల్లో రామదాసు రామభక్తి మత్త చిత్తవృత్తితో రామతత్త్వాన్ని ఆనందముగా గానంచేసి తరించినట్టివాడు. హనుమద్దాసు కూడా రామదాసుడు కావడం వల్ల ఆయన మీద రామదాసు ప్రభావం అధికంగా ఉన్నట్లు పరిశీలనల్లో తేటపడింది. ఈ ప్రభావం అనుకరణ అనుసరణం అన్న రెండు భేదాలతో ఉన్నదని సహేతుకంగా, సోపపత్తికంగా వివరించి చూపడం జరిగింది.

అందరూ అనుకుంటున్నట్లు ఈ ప్రభావం కవికి న్యూనతను ఆపాదించునట్టిదికాదు అతని కీర్తిని పెంచునట్టిది. రామదాసు వల్ల ప్రభావితుడైన హనుమద్దాసు రామభక్తిమయ ప్రపంచంలో సంలీనతను పొందించి ఉన్నతమైన మార్గంలో రామతత్త్వాన్ని పొందుకొని, లోకానికి అందరి ఆస్వాదాన్ని అందించి దానికి అజరామరత్వాన్ని కలిగించడం జరిగింది. ఈ అమరత్వం స్వర్గభోగం కాదు. వైకుంఠభాగ్యం మోక్షం.

## సంస్కృత గ్రంథములు


1 జగన్నాథరావు మంచాల (సంపాదకులు) "శ్రీజయదేవ కవికృత గీతగోవిందము పంచరత్నకవి అనంతనారాయణ కృత గీతశంకరము

2 శ్రీజయదేవుడు గీతగోవింద కావ్యము (అష్టపదులు) (పండిత పరిశోధితము)

3 భరతముని నాట్యశాస్త్రము

4 లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతము పీఠిక—మద్దూరి శ్రీరామమూర్తి

5 వ్యాసమహర్షి శ్రీమద్భాగవతమ్

6 వ్యాసమహర్షి భగవద్గీత (తాత్పర్యసహితము

7 శ్రీశంకరాచార్యులు వివేక చూడామణి శ్రీవేమూరి సీతారామశాస్త్రి (అనువాదకుల)

8 శ్రీశంకరాచార్యులు వేదాంతడిండిమము

9 సుందర చైతన్యానందస్వామి శ్రీనారదభక్తి సూత్రములు


## ఆంధ్ర గ్రంథములు


10 ఆనందమూర్తి వేటూరి తొలిసంకీర్తన కవులు

11 ఆనందమూర్తి వేటూరి వైష్ణవాంధ్ర వాఙ్మయము

12 కామేశ్వరమ్మ గూటాల జయదేవ చరిత్ర

13 క్షేత్రయ్య క్షేత్రయ్య పదములు

14 గంగప్ప ఎస్. తెలుగులో పదకవిత

15 నరసింహాచార్యులు కిడాంబి తిరునామములు—సమగ్రపరిశీలన

16 నారాయణాచార్యులు పుట్టపర్తి వాగ్గేయకారుల పదకృతిసాహిత్యం

| | | |
|---|---|---|
| 17 | నృసింహకవి | శ్రీభద్రాచల రామదాసు చరిత్ర |
| 18 | నృసింహకవి | శ్రీమన్నెంకొండ హనుమద్దాసు చరిత్ర |
| 19 | పురుషోత్తం వాడ్రేవు (సంపాదకులు) | త్యాగరాజు కీర్తనలు(స్వరసహితము) (6 సంపుటములు) |
| 20 | పురుషోత్తం వాడ్రేవు | రామదాసు కీర్తనలు (స్వరసహితము) |
| 21 | పోతన బమ్మెర | శ్రీమదాంధ్రి మహాభాగవతము 1, 2 సంపుటములు |
| 22 | రజనీకాంతరావు బాలాంత్రపు | ఆంధ్రవాగ్గేయకార చరిత్ర |
| 23 | లీలావతమ్మ పాన్నా | 'అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు |
| 24 | వేదవల్లి తాయరమ్మమాణిక్యం కౌసల్యాదేవి చినగంథం | శ్రీభగవదారాధన |
| 25 | శమంతకమణి పండా | తెలుగు సాహిత్యంలో రామకథ |
| 26 | సంగమేశం ముటన్నూరి | అన్నమాచార్య సాహిత్యకౌముది |
| 27 | సచ్చిదానందమూర్తి కొత్త (సంపాదకులు) | విజ్ఞానసర్వస్వము (7వసంపుటము) |
| 28 | సర్వోత్తమన్ కె | రామదాసు—త్యాగరాజు |
| 29 | సర్వోత్తమన్ కె. | అన్నమయ్య—త్యాగయ్య |
| 30 | సర్వోత్తమన్ కె. | అన్నమయ్య—శ్రీపాదరాయలు |
| 31 | సీతారామాచార్యులు బహుజనపల్లి | శబ్దరత్నాకరము (తెలుగు నిఘంటువు) |
| 32 | సుందరం ఆర్వియస్ | తెలుగు సాహిత్యంలో దేశికవిత |
| 33 | సుబ్బరామ దీక్షితులు | సంగీత సంప్రదాయ ప్రదర్శిని (మొదటి సంపుటము) |
| 34 | సోమశేఖరశర్మ మల్లంపల్లి (సంపాదకులు) | విజ్ఞాన సర్వస్వము 3, 4, సంపుటములు |

## వ్యాసములు:


35 ఆనందమూర్తి వేటూరి — 'తెలుగు సంకీర్తన లక్షణము లక్ష్యలక్షణ సమన్వయము' 'భారతి ఆగస్టు 1971

36 గాథిరాజు పాల్కూరి — 'మనదేవాలయాలు శ్రీవేంకటేశ్వరస్వామి—మన్నెంకొండ' 'సప్తగిరి' సెప్టెంబర్ 1986

37 చంద్రశేఖర్ వెల్జాల — 'రెండో తిరుపతి మన్నెంకొండ' ఆంధ్రభూమి దిన పత్రిక 14-09-1986 (ఆదివారం)

38 మోహన్ జి. యస్. — తెలంగాణా పుణ్యక్షేత్రం 'మన్నెంకొండ' 'ఆంధ్రజ్యోతి దినపత్రిక 6-9-1987 (ఆదివారం)


## ఆంగ్ల గ్రంథములు:


39 Aurobindo — The Foundation of Indian culture

40 Narsimha Rao .P — Sri Manyam Konda Kshetram'

41 Raghavan .V — The great Integrators The Saint Singers of Indian

42 Samba Murthy .P — South Indian music series

43 Vijaya Raghava Charya V. and G. AdinarayanaNaidu — The Minor works of Tallapaka Poets' Vol-I

శ్రీశ్రీ మన్నెంకొండ 'లక్ష్మీవేంకటేశ్వర' స్వామివారి అర్చకులు ధర్మకర్తలును, వైష్ణవ కులభూషణులు, పరాంకుశగోత్రోద్భవులగు. శ్రీమాన్ అళహరి రామయ్యగారి వంశవృక్షము:—

5
శ్రీమాన్ అళహరి నారాయణ స్వామిగారు
(ప్రస్తుత వంశపారంపర్య ధర్మకర్త)

12
శ్రీమాన్
పాపయ్యగారు

13
శ్రీమాన్
అళహరి రామయ్యగారు

14
శ్రీమాన్
వెంకటస్వామిగారు

10
శ్రీమాన్ రామయ్యగారు

11
శ్రీమాన్ అనంతయ్యగారు

7
శ్రీమాన్
అళహరి మేఘయ్యగారు

8
శ్రీమాన్
అళహరి పాపయ్యగారు

9 ❀
శ్రీమాన్ అళహరి
హనుమద్దాసులవారు

5
శ్రీమాన్ అళహరి
వెంకయ్యగారు

6
శ్రీమాన్ అళహరి
పాపయ్యగారు

4
శ్రీమాన్ అళహరి రంగయ్యగారు

3
శ్రీమాన్ అళహరి అనంతయ్యగారు

2
శ్రీమాన్ కేశవయ్యగారు

1
మూలపురుషులు
శ్రీమాన్ అళహరి అనంతయ్యగారు




---

❀ మన గ్రంథంలోని వాగ్గేయకారుడు ఈతడే. ❀